ప్రధాని బైచప్ప, కాటణ్ణ, రత్నాజి, బహాదూరుఖాన, నేమిఖాన మున్నగువారల ప్రస్తావము తెనుగు కథయందు లేదు. బైచప్పకు బదులు ఆనోజి పంగులింగడు ప్రధాని పదమునకు నియుక్తుఁడాయె. ఇతఁడు ప్రధాని వస్త్రులు దొడుగుకొనిన యంతేద; ప్రధాని కుచితమైన గుణము లితనికి లేవు. న్యాయముమీద దృష్టిలేదు; పోలికరాముని దుష్కృత్యములవలన పీడితులైన జనుల నదలించి బెదరించి నూఱు రూపాయలిచ్చి వారి నోరుమూయించుటయందె యితనికిగల శక్తిసామర్థ్యములు వినియుక్తమైనవి. బైచప్పకును నితనికిగల భేదము హస్తిమశకాంతరము పోలికరాముఁడు కాటణ్ణస్థలమును తెనుగు కథయందలంకరించినాడు కాటణ్ణ కంపిలిరాయల కుమారుడని యొకచోటను పెంపుడుకొడుకని మఱియొకచోటను కర్ణాటక కథయందు జెప్పబడి యున్నది. కాటణ్ణ శూరుఁడు, పితృభక్తుడు గుణవంతుఁడు. కార్యఖడ్గములందు కుమారరాముని దక్షిణహస్తము; పోలికరాముఁడు దాసీపుత్రుఁడు; దురాత్ముఁడు; అనృతవాది; దౌర్జన్యప్రియుఁడు దొంగ, హంత. అతనివల్ల రాజునకు అపకీర్తియు గుమారరామునికి కళంకమును గల్గినవి. కర్ణాటక కథయందలి కుమారరాముడు సత్యప్రియుడు; ఉదారుఁడు; ఆర్తత్రాణ పరాయణుడు; తెనుగు కథయందలి కుమారరాముఁడు పోలికరాముని దుష్కృత్యములందు భాగస్వామి. ఆతఁడు స్వయము అనృతవాదియు, దొంగయు, హంతయుగాక పోవచ్చును. కాని పోలికరాముని రాజు కోపమునకు గుఱికానీక తప్పించుటకొఱకు బొంక వెనుదీయలేదు; ఊరివారి పిల్లలను పోలికరాముడు జంపుచుండినను వారింపక గన్నుల జూచుచుండెను; పూజారి వారి బిడ్డలను వట్టివాగులో బాతిపెట్టుటకు దోడ్పడెను; రాజుచే శిక్షితుఁడైన దొంగనుడాచెను; కావున నతని నడవడిక నిష్కలంకమైనదికాదు. రత్నాజి తెలుగు కథయందు రాకపోయినను మద్దా? మలసాని యామెకు గ్రీడ యని చెప్పనొప్పును; రాజునకది భార్య కాదు. వలచి తెచ్చుకొనిన భోగకాంత; కుమారరామునితో దానికి సంబంధము లేకపోయినను పోలికరాముని హృదయమును చూఱగొన్నది. మలసానికొఱకే యతఁడు దొంగిలినది. ఆత్మరక్షణార్థమది పోలికరాముని చౌర్యము నరియాలదేవి కెఱుకపఱచినది. కర్ణాటక కథయందు రత్నాజి పాతివ్రత్యమును జెఱచెనని రాజు కుమారరామునికి మరణదండన విధించిన, ఇందు దొంగిలినందుకు పోలికరాముని వధింప నాజ్ఞాపించెను; అందు బైచప్ప కుమారరాముని నేలమాళెమునడాచి సంరక్షించిన నిందు కుమారరాముడు పోలికరాముని కావున దాఁగురించి కాపాడెను. ఆంధ్ర కర్ణాట కుమారరాముని కథం లదలి ఇతివృత్తమిట్లు భిన్నముగ గాన్పించినను, వానికి గాఢమైన పోలిక లేకపోలేదు.

ఇఁక నీ రెండు కథలలో నేది వాస్తవమో కనుగొనవలసి యున్నది; కాని వాని వాస్తవికతను పరిశీలించుటకుముందు చరిత్ర గ్రంథములలో గానవచ్చు కంపిలిరాయ వృత్తాంతమును దెలిసికొనుట యుక్తము. న్యూనిజను పోర్చుగీసు వర్తకుఁడు కృష్ణదేవరాయల కాలమున విజయనగరమునకు వచ్చియుండెను; అప్పు డతఁడు జనశ్రుతివలన దెలియవచ్చిన కంపిలిరాయ వృత్తాంతమును దాను రచించిన విజయనగర చరిత్రయందు సంగ్రహముగ జెప్పియున్నాడు.

(అ) తోగామామిదు (మహమ్మదు తుఘ్లూకు) అను తురుష్కరాజు డిల్లీని పాలించుచుండెను. క్రీ. శ. 1330 వ సంవత్సరమున నతడు గుజరాతు దేశమును జయించెను. అప్పుడు నగుంది నదీ

(తుంగభద్ర) తటమున నగుంది యను పట్టణమున హిందూరాజొకడు రాజ్యము సేయుచుండెను. అతని రాజ్యమును జయింపదలచి గొప్ప సైన్యముతో గుజరాతు దేశమునుండి బయలుదేరివచ్చి బాలఘాటు రాజ్యమును జయించి యా రాజ్యమునకును నగుంది రాష్ట్రమునకును మధ్య ప్రవహించుచుండిన దుష్ట నదిని దాటి నగుందిపై నడచి యా పట్టణమునకు ముట్టడివేసెను. ఢిల్లీసుల్తాను బలాతిశయమును గాంచి యచట నతనితో బోరదనకు శక్తి చాలదని యెఱిగి నగుందిరాజు తన రాజధానిని త్యజించి బలిష్ఠమైన క్రిన్మటదుర్గమునకు బోవుట యుక్తమని తలచెను. నగుంది యందలి యేబదివేల ప్రజలకును క్రిన్మటమున దావులేదనియు, వలసిన భోజన సామగ్రి చాలదనియు దలంచి ముఖ్యుల నైదువేలమందిని మాత్రము వెంటబెట్టుకొని యచటికిబోయి చేరెను; కాని సుల్తాను సైన్యములు దరువాత యల్పకాలమున కచటికి వచ్చి యా దుర్గమును నైతము ముట్టడించెను; ఇంక శత్రువులకు వశము గానీయక కోటను గాపాడుట సాధ్యముగాదని యెఱింగి నగుందినుండి తాను దోడ్కొనివచ్చిన యైదువేల మందిని సమక్షమునకు రప్పించి, తన యేలుబడిక్రింది రాష్ట్రమంతటిని దురకలాక్రమించిరనియు, దన స్వాధీనమందు మిగిలియున్న దాకోట యొక్కటియే యనియును, వస్తుసామగ్రియంతయు ఖర్చుపడిపోయుననియు, మహమ్మదీయులతో బోరి రణరంగమున నిహతుడగుటకు దాను సిద్ధపడితిననియు, దనతో గూడ యుద్ధమునకు నడువ సంసిద్ధులై యుండవలసినదనియు జెప్పెను. వారింద రేకగ్రీవముగ దమ యంగీకారమును దెల్పిరి. అంతట రాజిట్లనెను:— 'రణరంగమున శత్రువుల నెదుర్కొనుటకు ముందు, మనము ఆలుబిడ్డలపై కత్తిదూయవలసి యున్నది; వారిని శత్రువుల చిక్కనిచ్చుట మేలు గాదు. తొలుదొల్త నేను నా భార్యాపుత్రులను జక్కబెట్టెదను'. అప్పుడు కోటవెలుపలి పెద్ద మైదానమునం దంతఃపుర కాంత లందఱును నిలచియుండిరి; రాజు తన చేతితో నేబది భార్యలను గొందఱు పుత్రులను బుత్రికలనువధించెను; అతని యనుచరులందఱును అట్లే తమ భార్యలను యుద్ధము సేయజాలని పసిబాలురనుబట్టి వధించిరి.

భయంకరమైన మారణకర్మ ఇట్లు ముగియగనే కోట బోగుశల్పాలను దెఱచిరి; శత్రువులు దక్షిణపు కోటలో బ్రవేశించి యొక గృహమున డాగియుండిన నార్గురు జనులనుదప్ప తక్కిన వారి నందఱిని వధించిరి. 4

న్యూనిజు తోగామామిదతో యుద్ధముజేసి నిహతుడైన రాజుపేరు చెప్పలేదు; కాని యతని రాజధాని నగుంది పట్టణమనియు ముఖ్యదుర్గము క్రిన్మటమనియు దెల్పినాడు; నగుంది యానెగొంది; క్రిన్మటము కుమ్మటము. వీరకంపిలి (కుంభిణి) మహారాజేలినది యానెగొంది భూమి యనియు నతని ముఖ్యదుర్గము కుమ్మటమనియు నాంధ్ర కర్ణాట కుమారరాముని కథలవలన విదితమగుచున్నది. న్యూనిజు పేర్కొనిన నగుంది రాజు వీరకంపిలిరాయలగునేమో విచారింతము.

(ప) ఈ విషయమునునిశ్చయించుటకు ఈసామీ విరచిత ఫుతూహుస్సలాతీననుడిల్లీ సుల్తానుల చరిత్ర చాలావఱకు దోడ్పడగలదు. ఈసామీ జన్మస్థానము డిల్లీపట్టణము. క్రీ. శ. ౧౩౨౬-౨౭ వ సం॥ న సుల్తాను మహమ్మదు బిను తుఘ్లూకు తన రాజధానిని డిల్లీనుండి దేవగిరికి మార్చినపుడు డిల్లీ వాస్తవ్యు లనేకులవలె నతడును దేవగిరికి వచ్చి యందె స్థిరముగ నిలచిపోయెను.

4. Nnniz, Forgotten Empue pp. 291-95

క్రీ. శ. ౧౩౪౭ వ సంవత్సరమున గుల్బర్గయందు బహమనీ రాజ్యమును స్థాపించిన సుల్తాన్ అల్లావుద్దీన్ హసన్ గంగూ బహమనీ కత డాశ్రితుఁడు. క్రీ. శ. ౧౩౫౦ వ సం॥ నం దనగా కంపిలి రాజ్యము నశించిన యిరువది నాలుగవ సంవత్సరము నం దతఁడు తన ఫుతూహుస్సలాతీనను చరిత్రను వ్రాసి ముగించెను; కావున నతఁడు కంపిలిరాజ్య వినాశన కాలమున ఢిల్లీయందును మఱుసటి సంవత్సరమునుండి దేవగిరియందును నివసించుచుండిన సమకాలిక రచయిత. అతని చరిత్రయందు గానవచ్చు కంపిలి వృత్తాంతము వాస్తవ మని మనము గ్రహింపవచ్చును

అల్లావుద్దీన్ ఖిల్జీ కడపటి రోజులలో దేవగిరి యాదవరాజ్యమును ఢిల్లీ సామ్రాజ్యమందు గల్పుకొని మల్లిక్ నాయబు కాఫూరును దానికి పాలకుని గనియమించెను. అతడు దేవగిరి జేరిన పిమ్మట రామదేవుని యేలుబడి క్రిందనుండిన రాజ్యమునంతటిని తన యధికారము క్రిందికి దెచ్చుకొనుటకు బ్రయత్నమొనర్చెను. ఒకానొకప్పు డతఁడు కుమ్మరము పైనెత్తిపోయి యొక్క వారము రోజు లచట నాగెను; చుట్టుప్రక్కల దేశమును పాడుచేసి దుర్మార్గులను నిర్మూలము గావించి మఱలి యాతఁడు దేవగిరి జేరెను. మల్లిక్ నాయబు కాఫూరు కుమ్మరమును ముట్టడించి నప్పు డచట నెవ్వరు రాజ్యము సేయుచుండిరో ఈ సామీ చెప్పలేదు; కాని యతఁడు కంపిలిరాయలని నిస్సంశయముగ జెప్పవచ్చును. మఱియు మల్లిక్ నాయబు కాఫూరు కుమ్మరమును ముట్టడించెనేకాని సాధింపలేదు; కావున నతఁడు పరాభూతుడై వెనుకకుదిరిగిపోయెనని మన మనుకొనవచ్చును.

సుల్తాన్ ముహమ్మదు బిన్ తుఘ్లూకునకు మేనత్త కుమారుడు బహావుద్దీన్ గర్షాష్పుడను నతఁడు కృష్ణాతటమందలి సాగరుప్రాంతము నేలుచుండెను; అతఁడు గొప్ప శూరుఁడు. మొగలాయి యుద్ధములందు పరాక్రమ ప్రదర్శనమువలన పేరు ప్రఖ్యాతులను సంపాదించెను. అతఁడు ఢిల్లీ సింహాసనము నధిష్ఠింపగోరి రాజద్రోహమును దలపెట్టెను. సుల్తా నతనిపై దండంపి గోదావరి యుద్ధమున పరాభూతుని గావించెను. ఢిల్లీ సామ్రాజ్యము నందుండిన దనకు ప్రాణములు దక్కవని బహావుద్దీను దన యాలుబిడ్డలతోగూడ కృష్ణనుదాటి కంపిలిరాజ్యమును బ్రవేశించి, కుమ్మటమున కరుదెంచి కంపిలిరాయని దర్శనము జేసికొని శరణము వేడెను. కంపిలుఁ డాతనికి దన రాజధానియం దాశ్రయమొసగి మిక్కిలి సౌహార్దముజూపి, “ఓయి! ధైర్యవంతుఁడా! నీవు పరాజయము నందినందులకు శోకాగ్నికిం ధనముగావలదు. యుద్ధమునం దపజయము నందని ప్రభువెందును లేదు; లోకమర్యాద యట్టిదె కదా; కొన్ని సమయము లందచల ధైర్యముతో నిలువ వలెనగును; మఱికొన్ని యెడల శత్రులకు వెన్నుజూపి పాఱిపోవలసివచ్చును. యావజ్జీవమును ఒక్కస్థితి యందె యుండగల జను లరుదు. వీరోత్తమా! నా రాజ్యమునకు భవదీయాగమనము క్షేమకరమే. సూర్యచంద్ర గానుత్రుల సాక్షిగను నే గొలుచు దైవము సాక్షిగను నిన్ను సంరక్షించెదను. ఈ ప్రపంచ జనులందఱు నేకమై నీపై వచ్చినను నీకు గోరంత యేనియు గీడొనర్పజాలరు, దుఃఖింపకుము; నిరపాయ స్థలమునుజేరితివి. సంతోషస్వాంతుడవై సుఖముగ నుండుము” అని యూరడించెను.

కొన్ని రోజులు గడచినవి; సుల్తాను సైన్యములు సముద్రమువలె నుప్పొంగివచ్చి కుమ్మర దుర్గము నావరించినవి సుల్తాను ఢిల్లీనుండి వచ్చి దౌలతాబాదు చేరెను. అహమదు అయాను మల్లీకు జాదను దన సముఖమునకు రప్పించెను. మల్లిక్ రుక్ నుద్దీను, మల్లిక్ కుర్బుల్ ముల్కు లను

వారి నాయకత్వము క్రింద రెండుమారులు, సైన్యములను గుమ్మటముపై నంపెను; కాని రెండు పర్యాయములును సుల్తాను సైన్యములు ఓటుమందినవి; మూడవ పర్యాయము సుల్తాను మల్లిక్ జాదనే స్వయముగ నా దుర్గముమీది కంపెను; మల్లిక్ జాద సూటిగ కుమ్మటమునకు గూచిపోయి ముట్టడి వేసెను. కంపిలుడును గర్షాస్ప్యుడును రెండుమూడు పర్యాయములు కోట వెలుపడివచ్చి పరాజితులై మరల కోటకు బోయిరి; తరువాత మల్లిక్ జాద కోటను లగ్గలుపట్ట బ్రయత్నము జేసెను. మహమ్మదీయ సైనికులు విజృంభించి యెల్లయెడలను గాన్పించుచు, ఖడ్గసహాయులై కోట తలుపుల నెట్టుకొని లోపల బ్రవేశించిరి.

కంపిలుడును గర్షాస్ప్యుడును కోట యన్యాక్రాంతమగునని తెలిసికొని యచటినుండి బయలు వెడలి పర్వతారణ్యముల దారి బట్టిరి. సుల్తాను సైన్యము వెన్నంటి వెలువ నారంభించినది; మిక్కిలి శ్రమపడి యెట్లో హొసదుర్గమునజేరి యొక నెలగినముల పోరిరి, ఒకనాడు శత్రుసైన్యమంతయు నొక్క హుమ్మత్తున కోటపైఁ బడెను; భూమి యంతయు గళగళపడినది; వాతావరణము దుమ్ముతో నిండిపోయినది. ఈ వైపరీత్యమునకు జడిసి గర్షాస్ప్ దచటినుండి పారిపోవుట యుక్తమని తలచెను. రెండుమూడు గుఱ్ఱములను జేర్చికట్టి కోటక్రిందికి దోల్కొనివచ్చి వానిపై దన స్త్రీలను గూర్చుండబెట్టి, తాను వేఱొక గుఱ్ఱముపైనెక్కి యచటినుండి పారిపోయెను. మిత్రత్రాణ పరాయణుడగు నా హిందువు కంపిలుఁడు శూరధర్మమును వీడిపోసిక యచటనె నెలకొనెను. మిత్రుని నగారపడ యతని నెత్తిపై బడినది. అతని కుటుంబము నావరించినది. కాని యతఁడు జంకక కొంకక శత్రువుల నెదుర్కొని ఘోరముగ బోరాడెను; చిట్టచివర కాతఁడు హైంద పురుషోచితమైన రణశయ్య నలంకరించెను; హేతిఘాతలచే నతని దేహము విరియబూచిన గులాబిపొదవలె శోభాయమానముగ గన్పట్టెను.

సుల్తాను సైనికులు కోటను బ్రవేశించి యందలి ధనధాన్యాది పదార్థములను చూఱగొన నారంభించిరి. హిందువు లనేకులను వధించిరి. కొందఱను బందీకృతుల జేసిరి; ఒక్కొక్కభటుఁడును ధనము మిక్కుటముగ సేకరించెను. మల్లిక్ జాద హొసదుర్గమును స్వైవసము గావించుకొనుచుండగా నాతని సముఖమునకు సజీవుడైన హిందువునొక్కని బట్టి తెచ్చిరి. యుద్ధనిహతులైన హిందూవీరుల శిరముల నొక్కటొక్కటి నాతని ముందుబెట్టించి యా శిరములెవ్వరివో గుర్తింపవలసినదని యతనికాజ్ఞాపించెను; వాని గాంచినప్పుడా హిందువునకు గలిగిన దుఃఖమును వర్ణించుట కలవిగాదు. అమ్ముపోట్లచే నెఱ్ఱబారిన యొక శిరమును జూడగనే యతఁడు గొల్లున నేడ్వసాగెను. దుఃఖాతిశయముచే నతడు నెత్తిపై మట్టినిబోసికొని తలవెంట్రుకలను పీకివేసెను. అప్పుడు, 'ఏల యింతటి శోకము; ఎవ్వరి తల యిది? నీ యేడ్పునకు గారణమేమి" యని మల్లిక్ జాద యతని పృచ్ఛించెను. మిక్కుటముగ నేడ్చుచు నా హిందువు, 'ఎవ్వరి మరణమువలన మా దిగులును దుఃఖమును పెంపొందినవో ఆ మా రాజు తల యిది', అని బదులు చెప్పెను. అది వినగనె 'ఆ శిరము చర్మము నొలిచి పైడి పళ్లెమున బెట్టుడు, శత్రు గుండెలు వ్రీలుగాక, మిత్రుల హృదయము రంజించుగాక,' యని మల్లిక్ జాద పలికెను. 5

---

5. The Futuh-us-Salatin (Madras Edn.) pp 33-34, 420-31

ఈ సామీవలె కంపిలిరాయ చరిత్రను వర్ణించిన సమకాలిక మహమ్మదీయ రచయిత మఱి యొకడు గలడు. ఇతడు ఇబ్నె బత్తూతాయను యాత్రికుడు. ఇతడు మొరాకో జనపద వాస్తవ్యుడు; మహమ్మదీయ ప్రపంచమును జూచు వేడ్కతో నిబ్నెబత్తూత మాతృభూమిని విడిచి నానా దేశముల గ్రుమ్మరిలుచు క్రీ. శ 1333 వ సం|| మున హిందూదేశమునకువచ్చి యది మొదలు క్రీ. శ. 1342 వఱకును డిల్లీ పట్టణ కాజీగ సుల్తాన్ మహమ్మదు బిన్ తుఘ్లూకు కొలువునందుండెను. అవ్వల సుల్తానతనిని చైనా దేశమునకు రాయబార మంపెను. ప్రపంచయాత్ర ముగించుకొని యతడు నిజదేశమునకు బోయినపిమ్మట తన యనుభవములను వర్ణించుచు నొక గ్రంథమును రచించెను. ఇబ్నె బత్తూతా గ్రంథమున గానవచ్చు కంపిలిరాయల వృత్తాంతమును సంగ్రహముగ నిచట బొందుపఱుచుచున్నాను.

సుల్తాన్ (ఘయాజుద్దీన్) తుఘ్లూకునకు బహావుద్దీన్ గుష్టాస్పు నొక మేనల్లుడుండెను; సుల్తానతనినొక మండలాధిపతిని గావించియుండెను. అతడు తన మేనమామ కాలగతి నందిన పిమ్మట నతని కుమారుని యాధిపత్యము నంగీకరింపక నిరాకరించెను గుష్టాస్పు ధైర్యశాలియైన యోధుడు, శౌర్యసంపన్నుడు. సుల్తాన్ (మహమ్మదు బిన్ తుఘ్లూకు) మల్లిక్ మజీరు, వజీరు ఖ్వాజా జహాను మున్నగు సుప్రసిద్ధ దళనాయకుల నతని శిక్షించుటకై పెద్ద సైన్యముతోగూడ నంపెను ఇరువాగుల అశ్వదళములును దారసిల్లెను. భయంకరమైన యుద్ధము సంప్రాప్తమాయెను. ఇరుపక్షములవారును నసాధారణ పరాక్రమముజూపి పోట్లాడిరి. కాని కడపట విజయము సుల్తాను సైన్యమునకు జేకూడెను; బహావుద్దీను, రాయ్ కంపిలుడు అను హిందూరాజుకడకేగి యతని నాశ్రయించెను. క్రైస్తవులందువలె హిందూ ప్రజలయందును 'రాయ' శబ్దమునకు రాజను నర్థము చెల్లును; కంపిల యనునది యతడేలు దేశము పేరు. ఈ ప్రభువేలు దేశము దుర్గమపర్వతారణ్యమయము; అతడు ప్రముఖ హిందూ నరపాలకులలో నొక్కడు.

బహావుద్దీను కంపిలిరాయలకడకు పాఱితెంచెను; వెనువెంటనె అతని దఱుముచు వచ్చినవి సకల భారతావనీ నాథుని బలములు కోటలో సేకరించియుండిన ధాన్యమంతయు వ్రయమైపోయినది. శత్రువు లేనిమిషమునందైన లగ్గలు బట్టవచ్చును. తనకు సంప్రాప్తమైన విపద్దశను జక్కగ గ్రహించినాడు కంపిలిరాయడు; కావున నతడు బహావుద్దీనుని బిలచి, 'మా దుస్థితినిజూచుచున్నావు కదా; నా కుటుంబముతోడను ననుచరులతోడను నిచట ప్రాణముల నర్పించుటకు నిశ్చయించినాడను. (ఒక హిందూరాజుపేరుజెప్పి) నీవు ఫలాని సుల్తానుకడకు బొమ్ము; అతని నాశ్రయింపుము. అతడు నిను సంరక్షింప దక్షుడు' అని చెప్పి యాతని కడకు దోడ్కొనిపో నొక భృత్యునిచ్చి పంపించెను.

తరువాత కంపిలిరాయలొక గొప్ప గుండమునం దగ్నిని బ్రజ్వరిల్లజేసి తన పదార్థమంతటిని నందువైచి తగులబెట్టెను. అతని భార్యా పుత్రికలతో నిట్లనెను. 'నేను చచ్చుటకు సిద్ధపడినాడను; నా మార్గము ననుసరించుటకు మీలో నెవ్వరికైన నిష్టమున్న నట్లు చేయవచ్చును'. అటుపిమ్మట నతని భార్యలందఱును స్నానమొనర్చిరి; ముకసరి చందనమును దేహముల కలదుకొనిరి; ఒక్కరొక్కరుగవచ్చి కంపిలిరాయల పాదములముందు సాగిలబడి మ్రొక్కి లేచిపోయి యగ్నిగుండమునం దుఱికి యందఱును మసియైరి. అమీరులు వజీరులు, దొరలు మున్నగువారి కాంతలెల్లరును రాజస్త్రీల ననుగమనించిరి; సామాన్య స్త్రీలనేకులట్లే మడిసిరి. రాజువంతు వచ్చినది; అతడును స్నానమాడి దేహ

మునకు చందనము నలదుకొనెను; కవచమును విసర్జించి కైదువులను ధరించెను. అతనితోగూడ చావునకు సిద్ధపడిన యనుచరులెల్ల నట్లే చేసిరి. తరువాత, కోటను వెలువడి సుల్తాను సైన్యముపై బడిరి; గతాసువులై నేలకొరిగెడువఱకు శత్రులతో బోరి యందఱును నిశ్శేషముగ నిహతులైరి. సుల్తాను పౌజులచేత పట్టణముపై గవసి యచటి జనుల బందీకృతుల గావించెను; కంపిలిరాయని పుత్రులేకాదశ సంఖ్యాతులు బట్టువడిరి. వారిని సుల్తానుకడకంప వారందఱిని బలాత్కరించి యతఁడు మహమ్మదీయ మతమున గలిపెను'. 5

న్యూనిజు ఈసామి యిబ్నెబతూతాలు చెప్పు కంపిలిరాయ వృత్తాంతమును వివరించినాడను. న్యూనిజు చెప్పినది యనుశ్రుతముగ జనానీకమందు పరంపరగ వచ్చుచుండిన గాథ; ఆంధ్ర కర్ణాట కుమారరాముని కథలవంటిదే. న్యూనిజు కృష్ణరాయల సమకాలికుఁడని పైనుడివి యున్నాఁడను. కావున యతఁడు గ్రంథస్తము జేసిన కథ క్రీ. శ. ౧౬ వ శతాబ్ద పూర్వార్ధమున విజయనగర ప్రాంత దేశమున వాడుకయందుండెనని చెప్పవచ్చును.

ఈసామీ యిబ్నె బతూతాలు కంపిలిరాయలకు సమకాలికులు. కాని తాము వర్ణించిన యంశములను వారు ప్రత్యక్షముగ జూచియుండలేదు. ప్రత్యక్షానుభవము దమకు లేకపోయినను, ప్రత్యక్షానుభవముగల వారినడిగి సంగ్రహించిన చరిత్రాంశములను వారు గ్రంథస్తము గావించిరి. కావున వారు చెప్పు వృత్తాంతము సత్యాత్మకమని మన మంగీకరింపవచ్చును. కాని వీరు వర్ణించిన కంపిలిరాయ చరిత్ర సంపూర్ణమైనది కాదు; కంపిలిరాయ చరిత్రను జెప్పుట వారి యుద్దేశము గాదు; బహాఉద్దీన్ గర్షాస్పు వారి యభిమానమునకు పాత్రుడైన వీరుడు; అతని యుదంతమున కానుషంగికముగ వారు కంపిలిరాయాఖ్యానమున జెప్పవలసి వచ్చినది; కావున బహావుద్దీనుకు కంపిలిరాయలతో సఖ్యము గుదిరినప్పటినుండియే యతని కథను వారు వివరించిరి అతని పూర్వ చరిత్రతోగాని కుటుంబ వృత్తాంతముతోగాని వారికి బనిలేదు. కావున కంపిలిరాయల చరిత్రను సంపూర్ణముగ దెలిసికొనుటకు వారి రచనలు దోడ్పడవు. 7

న్యూనిజు చెప్పు కంపిలిరాయ వృత్తాంతము సైత మసంపూర్ణమైనదే; మఱియు కొన్ని ముఖ్యాంశములయందతని కథ సమకాలిక మహమ్మదీయ రచయితలు చెప్పు దానికంటె భిన్నముగ నున్నది. (1) కంపిలిరాయలపై సుల్తాను పండ్రెండు వర్షములనుండి యుద్ధము సల్పుచుండెనని

6. Foreign Notices of South India, pp. 216-17.

7 మల్లిక్ నాయబు కాఫూరు కంపిల్లిపై దండువెడలి దేశమునంతయు పాడుగావించి యొక వారము దినములు కమ్మటదుర్గమును ముట్టడించి వెడలిపోయెనని ఈసామీ వక్కాణించి యున్నాడు; కంపిలిరాయని కొడుకులు పదునొక్కరు తండ్రి మరణానంతరము తురకలచే బందీకృతులై బలవంతముపై మహమ్మదీయమతమును స్వీకరించిరనియు వారియందు నసీర్, బఖ్తియార్, అబు ముస్లిమను ముగ్గురును దనకు మిత్రులనియు నిబ్నెబతూతా వచించియున్నాడు; కాని వారి పూర్వ హిందూ నామములను దెలుపలేదు; కావున వారిని ఆనవాలుబట్టి గుర్తించుటకు వీలుగాదు. ఇట్లు మహమ్మదీయ లిఖరులను కంపిలిరాయల పూర్వచరిత్రకు సంబంధించిన యంశమునొక్కరును పుత్రుల విషయ మొక్కరును వచించియున్నను నందుమూలమున కంపిలిరా[illegible]

న్యూనిజు వ్రాయుచున్నాడు.[7] ఇందు కొంత సత్యము లేకపోలేదు. మల్లిక్ నాయబు కాఫూరు మహారాష్ట్ర ప్రాంతమును దేవగిరినుండి పాలించుచుండినప్పుడు కంపిలిరాజ్యముపై దండెత్తిపోయి కుమ్మరదుర్గమును ముట్టడించి యుండెను కదా! ఈ ముట్టడి రామదేవుని మరణానంతము క్రీ. శ. ౧౩౧౪-౧౫ లో నడచినది మహమ్మదు బిన్ తుఘ్లూకు కంపిలిరాయని వధించి హొసమలదుర్గమును సాధించినది ౧౩౨౬-౨౭వ సంవత్సరమునందు. కావున సుల్తాను కంపిలిరాయలపై బన్నెండు సంవత్సరములుగ యుద్ధ సల్పుచుండెనని చెప్పవచ్చును. కాని ఇట్లు యుద్ధము సాగించిన సుల్తానొక్కఁడు కాడు. మల్లిక్ నాయబు కాలమున డిల్లీని పాలించుచుండినది అల్లావుద్దీను ఖల్జీ; కంపిలిరాయని జంపి యతని రాజ్యము నాక్రమించినది మహమ్మదు బిన్ తుఘ్లూకని పై జెప్పియున్నది కదా ఈ మధ్యకాలమున డిల్లీ సింహాసనముపై నలుగురు సుల్తానులు గూర్చుని రాజ్యపాలన మొనర్చిరి. వీరి యందెవ్వరును కంపిలిరాయలతో యుద్ధముజేసి నట్లగపడదు. (2) డిల్లీసైన్యములు మొదట పైకొని వచ్చినప్పుడు కంపిలిరాయ లానెగొందియం దుండె ననియు, నచట నిభాయింపజాలక కుమ్మరమునకు బోయెననియు, నచటనే సుల్తాను దళములచే నిహతుఁడాయెననియు న్యూనిజు వ్రాసియున్నాడు ఇది ఈసామీ వ్రాతకు ప్రత్యక్ష విరుద్ధము. మొదట కంపిలిరాయ లొకటి రెండు మాసముల పర్యంతము కుమ్మరమున ముట్టడి నిలచెననియు, నచట నుండుట క్షేమకరముగాదని యెంచి యవ్వల హొసదుర్గమునకుబోయి యచటనే తన వెంటవచ్చి యా కోటను సైతము ముట్టడించిన డిల్లీ దళములచే నిహతుడాయెననియు ఈసామీ పల్కుచున్నాడు. (3) తురకలచే బరాజయముగల్గుట నిశ్చయమని యెఱిఁగిన పిమ్మట గంపిలిరాయలు దన యంతఃపుర కాంతల నేబదిమందిని బిడ్డలతో స్వయముగ దెగటార్చెనని యున్నది; కాని యిబ్నెబత్తూతా కంపిలిరాయల యంతఃపుర స్త్రీ లెల్ల రగ్నిప్రవేశ మొనర్చిరని వ్రాసియున్నాడు. వీరిలో నెవ్వరుచెప్పునది సత్యమో నిర్ధారించి కనుగొనుటకు దగిన సాక్ష్య మన్యత్ర లభ్యము గాకపోయినను, యర్వాచీనుల సాక్ష్యముకంటె సమకాలిక సాక్ష్యము గరము విశ్వాసపాత్రమను చరిత్రపరిశోధన సిద్ధాంతము ననుసరించి న్యూనిజు వాక్యములకంటె ఈసామి యిబ్నెబత్తూతాల మాటలె సత్యాత్మకములని యంగీకరించుట యుక్తము.

ఈసామి యిబ్నెబత్తూతా న్యూనిజు గ్రంథములవలెగాక కన్నడ కుమారరాముని కథ కంపిలిరాయని చరిత్రను సంపూర్ణముగ వర్ణించుచున్నది. కాని పై గ్రంథములవలె నది చరిత్రయుగాదు, ప్రపంచపర్యటన వృత్తాంతమునుగాదు. జనానీకమును వినోదపెట్టుటకొఱకు రచియింపబడిన పాట. అందు చరిత్రాంశములతోపాటు మిథ్యాకల్పనలును గలవు. ఈసామి ప్రభృతుల గ్రంథములలో వర్ణింపఁబడిన కంపిలిరాయల కృత్యములన్నియు నిం దతని పుత్రుఁడగు కుమారరాముని కారోపింపబడి యున్నవి. కావున తొలుదొల్త వాస్తవముగ కంపిలిరాయలకు గుమారరాముఁడను పుత్త్రి డుండెనో, ఉండిన నతఁడు తండ్రి ఖడ్గమునకు గర్తయై యతని యుద్ధకార్యములను నిర్వహించెనో కనుగొనుట యుక్తము. ఏలన, కుమారరామునికథ యెంతవఱకు సత్యమో యందుమూలమున దెలియగలదు. కుమారరామునికథ ప్రకార మతనితో బోరాడిన శత్రులు ముగ్గురు, హొయ్సల బల్లాళుఁడు, ఓరుగంటి పతాపరుద్రుఁడు, ఢిల్లీసుల్తాను. ఈముువ్వురును కంపిలిరాయలతో బోరినట్లు అన్య చరిత్రాధారముల వలన దెలియ వచ్చుచున్నది. కుమారరాముఁడు రాజ్యాధిపతిగాఁడు; కంపిలిరా

7. Nuniz, Forgotten Empire p. 294

యలకు యువరాజు; తండ్రిపక్షమున అతడు పై మువ్వురు శత్రువులతో యుద్ధములు, కావున వానిని గంపిలిరాయలు చేసిన యుద్ధములును కుమారరాముని యుద్ధములును భిన్నములై యుండజాలవు, తండ్రియు బుత్రుడును నేకకాలమునను వారితో బోరియుండవలయును. కావున పై శత్రువులతో గంపిలిరాయల యుద్ధము జేసినట్లు తెలుపు నవ్యాధారములందు గుమారరాముడు పేర్కొనబడి యున్నాడేమో చూతము.

(జ) కంపిలిరాయ బల్లాలరాయల యుద్ధప్రస్తావము హొయ్సళ ముమ్మడి బల్లాలదేవుని శాసనములు కొన్నింటియందు కలదు.

క్రీ. శ. 1303 వ సం॥ నాటి యొకానొక మైసూరు శిలాశాసనమున దేవగిరి రామచంద్ర దేవుని సేనాధిపతి కంపిలదేవుడు చిత్రదుర్గము జిల్లాలోని హొళలాల్కెరె మీది కెత్తిపోయి బిమ్మట నకల్లు దుర్గాధ్యక్షుడును, ముమ్మడి బల్లాళుని బావమరదియునగు సోమెయదండనాయకుని వధించి నట్లు చెప్పియున్నది 8. క్రీ.శ. 1320 సం॥నాటి మఱియొక శిలాశాసన ప్రకారము ముమ్మడి వీరబల్లాళుడు దుర్రైవాడికి, వీరకంపిలి దేవునిమీదికి, దన సర్వసైన్యములతో గూడిచేసి పోయెను. యుద్ధము నడచెను, గాని దాని పర్యవసాన మిట్టిదని నిశ్చయించి చెప్పుటకు వీలులేదు 9. ఒకవేళ బల్లాళుడు పరాజితుడై వెనుకకు మరలిపోయెనేమో. కాలము దెలియని యింకొక శిలాశాసనమున ముమ్మడి బల్లాళుడు వీరకంపిలిదేవునిపై నెత్తిపోయి బల్లారి మండలమునందలి సిరుగుప్పకు దండుదిగెను; యుద్ధము జరిగినది; బల్లాళుని దళనాయకులు కొందఱు నిహతులైరి 10. క్రీ.శ. 1324 నాటి యొక శిలాశాసనమున బల్లాళునికిని వీరకంపిలదేవునకును యుద్ధము జరిగినట్లును నందెవ్వరో కొందఱు డొకడు రణనిహతుడైనట్లును జెప్పియున్నది. 11 ఇట్లెన్ని శాసనములందు కంపిలిరాయ బల్లాలరాయల యుద్ధము ప్రస్తావింపబడియున్నను కుమారరాముని మాట యందును గానరాదు. కుమారరాముని కథవలె ఫుతూహుస్సలాతీను మున్నగు సమకాలిక గ్రంథములు ఢిల్లీ సుల్తానుతో గంపిలిరాయని కడపటి యుద్ధమును నతని మరణమును వర్ణించుచున్నను, కుమారరాముని పేర్కొనవు. కాకతీయ ప్రతాపరుద్రుడు కంపిలిరాయలతో బోరాడినది సత్యమని యాంధ్ర వాఙ్మయము రుజువు సేయుచున్నది. శ్రీనాథుడు కాశీఖండ పీఠికలో బ్రతాపరుద్రుని మంత్రియగు ప్రోలయ యన్నయను,

'వీరరుద్రాశేష విశ్వంభరాధీశ పృథుల దక్షిణభుజాపీఠ మనగ

తే॥ యవనసంహార విలయ కాలాగ్ని యనగ
ధాటి విఘటిత కుమ్మ రోద్యానుడనగ
విశ్వలోక ప్రశస్తుడై వినుతికెక్కె.'

అని నుతియించియున్నాడు. మఱియు బ్రతాపరుద్రుని సామంతులలో నొక్కడైన కొటికంటి రాఘవుడు కంపిలిరాయల నోడించెను.

---

8. MAR 1913, p 50, EC XI. Hr. 106
9. EC VIII. Nr 19
10. MAR 1923. No 12
11. EC. XII. Tp. 24

'నమితారి తాత పిన్న మహీవిభుండు
ఘన శౌర్య డా కోటికంటి రాఘవుని
గనియె నతండు సంగ్రామంబునందు
రాజిల్లు కంపిలిరాయ సైన్యములఁ
దేజంబు మెఱయంగ దెగువమై గెలిచి
గరిమెగై కొనియె నగ్గండరగూళి
బిరుదంబు సరిన్నృపుల్ బేర్కొని పొగుడ.'

ఇందును కుమారరాముని ప్రస్తాపనలేదు. కన్నడ కుమారరాముని కథయందు అతఁడు రెండు పర్యాయములు డిల్లీసుల్తాను సైన్యముల నోడించి తఱిమగొట్టెననియు, మూడవపర్యాయము వారు మరల వచ్చి కుమ్మరమును ముట్టడించగా వారిని జయించుట యసాధ్యమని యెఱిగి యతఁడు మిత్రానుచరులతోగూడ చావునకు దెగించి యుద్ధమునకు బో సంసిద్ధుఁడాయెననియు, నతనిచే ననుజ్ఞగొని యంతఃపుర స్త్రీలెల్ల రగ్ని ప్రవేశము జేసిరనియు, నవ్వలనాతఁడు శత్రుసైన్యముల పైబడి పోరాడి వారిచే జచ్చెననియు, నతని శిరమును ఖండించి డిల్లీ సేనాధిపతి సుల్తానుకడ కంపెననియు జెప్పియున్నది ఈ యంశము లన్నియు సమకాలిక మహమ్మదీయ రచయితలగు నీ సామీయిబ్నెబతూతాలచేతను వక్కాణింపబడెను. ఇంచుక వ్యత్యాసముతో న్యూనిజుగూడ వీని వచించియున్నాడు. వీరందఱు సందర్భమున గంపిలిరాయలనే పేర్కొనెదరుకాని కుమారరాముని పేరైన నెత్తరు కావున కుమారరాముఁడు వాస్తవమైన చారిత్రక పురుషుఁడా లేక కల్పితుఁడా యను సంశయము గల్గుచున్నది.

కుమారరాముని వాస్తవికతను స్థాపింపదగిన సమకాలిక సాక్ష్యములేకపోయినను, తరువాత శాసనములలో గుమారరాముని ప్రస్తాపము గొంతకలదు. శకాబ్దము ౧౩౪౫ (క్రీ. శ. ౧౪౩౦) నాటి యొక్క శాసనమున నిమ్మడి దేవరాయల, యనుచరుఁడు పుట్టిగడె యను నతఁడు సకలికెనాడు లోని కొళవలి యనుస్థలమునకు వచ్చిన శత్రుసైన్యమును నెదిర్చి కుమారరామనాథు నంతటి పరాక్రమము జూపి యంబుల గూడై స్వర్గమును జూఱగొనెనని యున్నది.[12] ఇంతకంటె ముఖ్యమైనది శకాబ్దము ౧౩౨౪ (క్రీ. శ. ౧౪౦౨) నాటి సంగూరు వీరగలు శాసనము. దీనిని కంపిలరాయల బాహత్తర నియోగాధిపతియు, బతికార్యధురంధరుఁడును నగు బయిచయ ప్రెగ్గడ మనుమడును, సేనాధిపతి సంగముని పుత్రుఁడును నగుమాదరసు కుమార రామనాథదేవరకు స్మారకచిహ్నముగ నెత్తించెను.[13] శాసనములు రెండును కంపిలిరాయల నిర్యాణానంతరము నూఱేండ్ల లోపల వ్రాయబడినవి. వీని మూలమున రణనిహతుఁడైన కుమారరాముఁడను శూరుఁడొకడుండెనని క్రీ. శ. ౧౫ వ శతాబ్ద ప్రారంభమున శివమొగ్గధార్వాడ జిల్లాల ప్రజలు నమ్ముచుండిరని తెలియవచ్చుచున్నది. ఈరెండు జిల్లాలును గంపిలిరాయల యేలుబడిక్రింద నుండినవె. మఱియు సంగూరు శాసనము నెత్తించిన మాదరసు కంపిలిరాయల ప్రధాని బయిచప్ప మనుమడగుటచే నతఁడు ప్రతిష్ఠించిన కుమారరామనాథదేవర కంపిలిరాయల పుత్రుడెకావలయును. కావున కుమారరాముఁడు చారిత్రకపురుషుడనియు, బరాక్రమశాలియై యుద్ధమున మృతినొందెననియు నొప్పుకొనవచ్చును; అతని జంపిన శత్రువు డిల్లీసుల్తా

12. EC. VIII. Tl 23
13. EI XXIII p. 185

కావచ్చును; కాని కుమారరాముని కథయందాతనిగూర్చి చెప్పినదంతయును సత్యమని యంగీకరించుటకువీలులేదు. అందు చరిత్రాత్మకములుగాని యసత్యములు పెక్కుగలవు. ఇందు ముఖ్యమైనవాని నిచట వివరించుట మంచిది.

(1) కుమారరామునిపై డిల్లీ సుల్తాను కుమారిత వలపు: కుమారరామునకు బ్రతిపక్షియైన సుల్తాను మహమ్మదు బిన్ తుఘ్లూకు. అతనికి సంతతి లేదు. కావున నతనిపుత్రిక కుమారరాముని వలచి యుద్వాహమాడగోరుట గగనకుసుమము బరిమళించినట్లున్నది. ఈ కథకు సుల్తానీకల్యాణముతో జ్ఞాతిత్వ సంబంధము గలదు. డిల్లీ సుల్తాను కుమారిత శ్రీరంగనాథుని ప్రతిమనుజూచి మోహించి డిల్లినుండి శ్రీరంగమునకువచ్చి యాదేవు నుద్వాహమాడుట యెంత సత్యమో యిదియు నంతసత్యమె. రెండును గల్పిత కథలనుటకు సంశయములేదు.

(2) రత్నాంగి వృత్తాంతము: ఇది ప్రాచీనగాథ. మాఱుటల్లి దనసవతికొడుకుపై మరులుగొని యతనిచే దిరస్కృతయై మగనితో నతఁడు దన్ను నిర్బంధించెనని చాడి చెప్పి చంపించు కథ యూరిపిడీసు నాటినుండియు బ్రపంచమున జెల్లుబడి యందుండినదియె. భారతదేశమున నది రత్నాంగి సారంగధరుల కథయై వఱలినది. జనానీకము నాకర్షించుటకొఱకు ఈ కథను కుమార రాముని కంటగట్టినారు కర్ణాట కవులు.

(3) మాతంగి: ఢిల్లీ సుల్తానుయొక్క అంతఃపుర రక్షక స్త్రీలలో నిది యొకతె. పేరు తెలియదు. జన్మముచే మాదిగ యగుటచే మాతంగి యన బఱగినది. మహమ్మదీయ మతమును స్వీకరించెనెమొ తెలియదు. నేమిఖానుఁడు రెండుమారులు కుమారరామునిచే బరాజితుఁడై డిల్లికి దిరిగిపోగా, సుల్తాను కోపోద్దీపితుఁడై నిజ రాణివాస స్త్రీలతోగూడ దర్బారునకువచ్చి సభచేసెను. ఖానమలుకవజీరులెవ్వరును నతని దేఱిచూడ వెఱచిరి. గజదొంగను బట్టుటకు రాజుకడ దాంబూలమునుగొన జను భోగము రంగసానివలె ముందుకువచ్చినది మాతంగి కుమారరాముని దాను జంపెద నని శపథము జేసి. చెప్పినంత పనిచేసినది. కుమ్మటముపై నెత్తిపోయి కుమారరాముని యుద్ధమున జంపి యతని తలనుగొట్టి డిల్లి కంపినది.

ఇదియంతయు గల్పనా కథ. కన్నడ కుమారరామునికథ యందుతప్ప మాతంగి కథ మఱి యెచ్చటను గానరాదు. పదునాల్గవ శతాబ్దారంభమున డిల్లీసుల్తానుల కొలువున మాదిగివారికి తుల్యులైన పరవలను నధమజాతివారుండిరి. ఈకులమునకు జెందినవాడే డిల్లీ సింహాసనము నాక్రమించి నాలుగు నెలలకాల మాసామ్రాజ్యమును బాలించిన నాజీరుద్దీనను పట్టాభిషేక నామముగల ఖుస్రూఖానుఁడు. కాని యాజాతికిగాని మఱియేజాతికిగాని జెందిన యువతి యెవ్వతెయు డిల్లీ సేనాధిపత్యము వహించినట్లు తెలియదు. కావున మాతంగి కల్పిత స్త్రీయని దృఢముగ జెప్ప వచ్చును. కాని వాస్తవముగ కుమ్మటముపై మూడవపర్యాయము మెత్తివచ్చి కంపిలిరాయని యుద్ధమున జంపి యతని తలనుగోసి డిల్లి కంపినవాడు అహమదు అయాసు ఖ్వాజా-ఇ-జహానుఁ డని ఈసామి గ్రంథమున గలదు. ఇతడు మహమ్మదు బిన్ తుఘ్లూకుయొక్క ప్రధాన వజీరుఁడు.

మఱియు కేవల కల్పనా కథలు గాకపోయినను నసంగతములును నబద్ధప్రాయములైన సన్నివేశములు గొన్నికలవు. ఇందువచ్చు వ్యక్తులును వర్ణింపబడిన యంశములును జరిత్రాత్మకములే. కాని వానిసంఘటన సత్యమైనదికాదు. కుమారరామ కపిలేశ్వరగజపతుల యుద్ధమిట్టి కైతవ చరిత్రాంశములలో బ్రధానమైనది. కుమారరాముఁడు వర్ధిల్లినది క్రీ. శ. ౧౪ వ శతాబ్ద ప్రథమపాదము నందు. క్రీ.శ. ౧౩౨౩ వ సంవత్సరమున గుమ్మరదుర్గ పతన మప్పు డతఁడు తెగటార్చెను. కపిలేశ్వర గజపతి క్రి. శ. ౧౪౩౫ వ సంవత్సరమున సింహాసనము నధిష్ఠించి ౧౪౭౦ పర్యంతము ప్రజాపాలన మొనర్చెను. వీరిద్దరికి మధ్య నూఱేండ్ల కాలమున కధికమైన యెడము గలదు; కావున వీరిరువురికి యుద్ధము జరుగుట యసంభవము. నేమిఖానుని వృత్తాంతముగూడ నిట్టిదే. నేమిఖానుఁడు చారిత్రక పురుషుడుగాఁడు; కల్పితవ్యక్తి కాని యతనివని యెన్నబడిన కార్యము లన్నియు వాస్తవముగ జరిగినవే; కర్తమాత్ర మొక్కఁడుగాడు. అల్లావుద్దీను ఖిల్జీ దేవగిరి యాదవరాజ్యము పై దండువెడలి నప్పటినుండి మహమ్మదు తుఘ్లూకు కుమ్మరమునకు ముట్టడివేయువఱకున డిల్లీ సేనాధిపతుల కుప లబ్ధమైన విజయములన్నియు నతనికి దగులగట్టబడినవి.

ఇట్లు అసత్యములును నసంగతములగు గాథలతో నిండియున్నను, కన్నడ కుమారరాముని కథ చరిత్రకారున కత్యంతోపయుక్తమైనది. కంపిలిరాజ్య చరిత్రము నామూలాగ్రముగ వర్ణించు గ్రంథము వేఱొక్కటి కానరాదు. అందు వివరింపబడిన ముఖ్యాంశము లన్నియు వాస్తవముగ నడచినవే.

కంపిలిరాజ్య స్థాపకుఁడు ముమ్మడి సింగెయ నాయకుఁ డనియు, నతఁడు దేవగిరి రామదేవ రాయల నాశ్రయించి యుండిన సామంతుఁడనియు, నతనికి కంపిలి సోమేశ్వరదేవుని వరమున కంపిలి రాయఁడను పుత్రుఁడు బుట్టెననియు గుమారరాముని కథయందు గలదు. శాసనము లిదియంతయు సత్యమని రుజువుసేయుచున్నవి. క్రీ. శ. ౧౨౮౦ సం॥న నిల్పిన శిలాశాసనమున నొకదానియందు, రామదేవరాయల నాయకులలో కురుగోడును పాలించుచుండిన చౌండరసను వాడు దొరవాడి యందుండు ముమ్మడి సింగెయనాయని మీదికెత్తి పోయి యుద్ధమున మడిసె నని యున్నది.[14] ఆసంవత్సరమునందె వ్రాయించిన మఱియొక శిలాశాసనమున ముమ్మడి సింగెయనాయకుఁడు ... మ్మలూర కల్లు అను దుర్గమునకు ముట్టడివేసెననియున్నది;[15] అప్పటిదె మఱియొక శాసనమున ముమ్మడి సింగెయనాయకుఁడు వెతండకల్లనుచోట సంగెయనాయకుఁడను వానితో యుద్ధముజేసినట్లు చెప్పియున్నది.[16] శ్రీ వీర రామ దేవరాయలు రాజ్యము పాలించుచుండగా ముమ్మడి సింగెయనాయకుని కుమారుఁడు ఖండెయరాయఁడు క్రీ. శ. ౧౩౦౦ సం॥న, పూర్వము కృష్ణకందార భూభుజు డిచ్చిన హరిహర అగ్రహారమును పునరుద్ధరించినట్లు అచటి శాసనమువలన దెలియవచ్చుచున్నది [17]. పంపా క్షేత్రమున ప్రసన్నవిరూపాక్షస్వామి యాలయమున వ్రాయించిన యొక శిలాశాసనమున ముమ్మడి సింగెయనాయకుని పుత్రుఁడగు వీరకంపిలిదేవుడు తనతల్లి మాదానాయకితి పేరను సింగెయనాయకుని పేరను పగమెయనాయకుని పేరను లింగ ప్రతిష్ఠగావించెనని యున్నది [18]. ఈశాసనములవల్ల

14, EC. VII Ci. 24
15. EC. XI. Hr. 86
16. EC. XI. Hl. 37
17. EC XI. Dg. 26
18. L. R 46, VR. I Ap 335

కంపిలిరాయనిపుట్టుకనుగూర్చి కుమారరాముని కథయందు జెప్పిన సంగతి వాస్తవమైనదని తెల్లమగుచున్నది 19

కుమారరాముని కథయందు జెప్పినట్లు కంపిలిరాయలకు బల్లాళునితోడను ప్రతాపరుద్రునితోడను వైరము గల్గుటయు, వారితో నతడు యుద్ధముసేయుటయు నిజమే. హొయ్సళుల ముమ్మడి బల్లాలుని శాసనములును ఆంధ్రవాఙ్మయమును వీని యాథార్థ్యమును రుజువు సేయుచున్నవి. డిల్లిసుల్తానుతోడి పగయు నిజమే; కాని ఈపగకు కుమారరామునికథయందు రెండు కారణములు చెప్పబడినవి మొదటిది సుల్తాను కుమారితను గుమారరాముడు పెండ్లాడ నిరాకరించుట. ఇది కల్పనయని మున్నె చెప్పియున్నాను. సుల్తానుకు సంతతియే లేనప్పుడు, అతని కుమార్తె రాముని వరించుటయు, తండ్రి ఆమె నుద్వాహమాడ నీయకొనక పోవుటయు దత్కారణమున సుల్తానతనిపై బగబూని దండు వెడలుటయు నసంభవము. కంపిలిరాయడు బహాదరుఖానుని కాశ్రయమిచ్చుట రెండవది. ఇది మొత్తముమీద నిజమనియే చెప్పవచ్చును. బహాదరుఖాను సుల్తాను సామంతులలో నొక్కడనియు, నతడు దస్త్రవిద్యయందు దననేర్పు జూపినందుకు మెచ్చి సుల్తానాతని కపారధనమిచ్చి బహూకరింప, నీర్ష్యాళువులై ఖానమలుకవజీరు లెల్లను కుట్రలుబన్ని వానిపయికము మన ప్రోత్సహించిరనియు, నందుమీద బహాదరుఖానుడు డిల్లీనుండి కుమ్మటమునకు బాఱిపోయి కంపిలిరాయని శరణు వేడెననియు, గంపిలిరాయ లందు కంగీకరింపగా సుల్తాను కతనిపై గోపమువచ్చి దండు వెడలెననియు

19. కొందఱు చరిత్రకారులు క్రీ. శ. ౧౪ వ శతాబ్దప్రారంభమునం దానెగొంది ప్రాంతభూమిని జంబుకేశ్వరరాయలు అను రాజేలుచుండెననియు నతని జయించి మహమ్మదు బిన్ తుఘ్లూకాదేశమును డిల్లీ సామ్రాజ్యమున గలుపుకొనెననియు వ్రాసియున్నారు. (*See*, B. Suryanarayana Row, *Never to be Forgotten Empire pp.* 10-13, Ch, Virabhadra Rao *Andhrula Charitramu p.* 315). వీరి వ్రాతలకాధారము రాయవంశావళియును ఆనెగొంది జమీందారుల పూర్వచరిత. రాయవంశావళి యందా దేశము నీక్రింది రాజులుపాలించినట్లు చెప్పియున్నది: నందమహారాజు (క్రీ.శ. ౧౦౧౪—౧౦౩౬); ఇతని కొడుకు చాళుక్యమహారాజు (౧౦౭౬—౧౧౧౭); అతని కొడుకులు కల్యాణపురమును పాలించిన బిజ్జల మహారాజు, తండ్రి యనంతర మానెగొందిని (౧౧౧౭ నుండి ౧౧౫౬ వఱకు) పాలించిన విజయధ్వజుడు, విష్ణువర్ధనుడు. విజయధ్వజుడు తనపేర విజయనగరపట్టణమును నిర్మించెనట. విజయధ్వజుని కుమారుడు అనువేముడు (౧౧౫౫—౧౧౭౮); అతని పుత్రుడు నరసింహదేవరాయలు (౧౧౭౮—౧౨౪౬), అతని కుమారుడు రామదేవరాయలు (౧౨౪౬—౧౨౭౧), అతని తనయుడు ప్రతాపరాయలు (౧౨౭౧—౧౨౯౭); అతని కుమారుడు జంబుకేశ్వరరాయలు (౧౨౯౭—౧౩౩౪).

రాయవంశావళి కేవల కల్పనాకథ. అందు చెప్పబడిన రాజవంశము వాస్తవమైనదని రుజువుసేయగల సాధనము లెవ్వియు లేవు. మహమ్మదీయులు జయించుటకుముం దానెగొంది దేశమును పాలించుచుండినవారు కంపిలి రాజులు. వీరియందు మొదటివాడు ముమ్మడిసింగయ నాయకుడు; అతని యనంతర మతని కుమారుడు కంపిలిరాయలు రాజ్యాధిపతియాయెను. వీరు మొదట దేవగిరి యాదవరాజులకు సామంతులు; క్రీ. శ. ౧౩౧౨ వ సంవత్సరమున రామదేవరాయలు చెఱపోయిన పిమ్మట స్వతంత్రులు. దేవగిరి యాదవరాజులకుముందు కాలచుర్యులును, నంతకుముందు చాళుక్యులును ఆనెగొంది ప్రాంతములును పాలించిరి.

కుమారరామునికథ యందు చెప్పియున్నది బహాదరుఖా ననునది అతని నిజమైన పేరుగాదు. అతని పేరు బహావుద్దీన్ గర్షా(ష్టా)స్పు. అతఁడు సామంత మాత్రుఁడుగాదు. సుల్తానుకు సాక్షాత్తు మేనత్తకొడుకు. అస్త్రవిద్యాప్రదర్శనము కల్పనాకథ. సుల్తాను కతనిపై క్రోధముజనించుటకు కారణ మేమనఁగా సుల్తాను తండ్రి ఘియ్యాజుద్దీను కాలగతినొందిన పిమ్మట మహమ్మదు బిన్ తుఘ్లూకు రాజ్యాధి పత్యము నంగీకరింపక, తానే వాస్తవమైన సుల్తానునని బహావుద్దీను ప్రకటించి తన నాయంకర సీమయైన సాగరు నందు సైన్యములను గూర్పనారంభించెను; కాని సుల్తాను దళనాయకులతో యుద్ధమునందోడి కుటుంబముతోఁగూడ కుమ్మరమునకు బాఱుతెంచి కంపిలిరాయుని శరణువేడెను; కంపిలిరాయ లతని కాశ్రయమొసగి నందులకు గినిసి యతనిపై సుల్తాను దండు వెడలెను. ఇది వాస్తవముగజరిగిన చరిత్ర. కావున కుమారరాముని కథయందలి బహదూరుఖానుని యుదంతము కేవలము కల్పితము గాదు, అందణుమాత్రము నిజము గలదు.

సుల్తాను కుమ్మరదుర్గమును మూడుపర్యాయములు ముట్టడించెననియు, మొదటి రెండు తడవలలో నేమిఖానుఁడును, మూడవమారు మాతంగియు సైన్యాధిపత్యము వహించిరనియు గుమారరామునికథయందు కలదు. సుల్తాను మూమ్మారు కుమ్మరమును ముట్టడించినమాట నిజమే. నేమిఖానుఁడును మాతంగియు గల్పితవ్యక్తులని యింతకుముందు నిరూపించియున్నాడను. కావున వారియాధిపత్యము క్రింద దండు నడుచుట యసంభవము. మొదటి తడవ మల్లిక్ రుక్నుద్దీనును, రెండవసారి నిజాముల్ ముల్కును, మూడవమారు అహమదు ఆయాసు ఖ్వాజా-ఇ-జహానును డిల్లీ సైన్యముల కధిపతులని ఈసామీ చెప్పుచున్నాడు. దండనాయకు లెవ్వరైనను కుమారరాముని కథయందు చెప్పినట్లు డిల్లీసైన్యములు గుమ్మరమును మూఁడుమార్లు ముట్టడించుటయు మొదటి రెండుమారులు బరాజయమందుటయు గడపటి పర్యాయము విజయు లగుటయు నిక్కము.

రణనిహతుఁడైన కుమారరాముని తలను మాతంగి డిల్లికి సుల్తాను కడకంపెనని కుమారరాముని కథయందున్నది; అట్లుకాక, కంపిలిరాయల శిరమునే అహమదుఅయాసు నఱికించి బంగారు పళ్లెరము నందిడి నట్లీ సామీ చెప్పుచున్నాడు. కుమారరాముఁడు యుద్ధరంగమున శత్రులచే మడిసి వీరస్వర్గమును చూఱగొనినట్లు శాసనములు పల్కుచుండుటవలన తండ్రితోఁగూడ కుమారరాముడుగూడ యుద్ధమున దెగటాఱెనని మన మనుకొనవచ్చును; కాని కంపిలిరాయుని తలనుబోలి యతని తలను గూడ శత్రులు గోసిరేమొ నిర్ధారించుటకు వీలుగాదు.

ఈవిషయములనెల్ల దృష్టియందుంచుకొని పరిశీలించి చూడగా గుమారరాముని కథవలన దెలియవచ్చు నికరమైన చరిత్రాంశములివి. దేవగిరి రామదేవరాయల కాలమున హంపి ప్రాంతమందలి దొరవాడి యను స్థలమున క్రీ. శ. ౧౨౮౦ —౧300 మధ్య ముమ్మడి సింగెయనాయకుఁడను దొరయొకడేలుచుండెను; ఇతని కుమారుఁడు కంపిలిరాయఁడు. తండ్రి యనంతర మతఁడు గద్దె ద యెక్కెను. కంపిలి యానెగొంది హంపి కుమ్మర హొసమలెదుర్గము లతని యేలుబడిక్రింద నుండినవి. శూరశిఖామణియగు తనకుమారుఁడు కుమారరామనాథుఁ డతనికి చేదోడై ప్రవర్తింపగా గంపిలిరాయలు హొయ్సల ముమ్మడి బల్లాళునితోడను, గాకతీయ ప్రతాపరుద్రునితోడను తఱచుగ యుద్ధము నేయుచుండువాడు. డిల్లీ సుల్తాను తన మేనత్తకొడుకగు బహావుద్దీన్ గర్షాష్పున కాశ్రయ

మొసగెనని కోపించి కంపిలిరాయల జంపి యతనిరాజ్యమును స్వాధీనపఱచుకొన నిశ్చయించి దండు వెడలెను; రెండు పర్యాయములోడి పాఱిపోయెను మూడవ పర్యాయము విజయుండై కంపిలిరాయని అతని కుమారుని రామనాథుని జంపి కంపిలి రాజ్యమును దనసామ్రాజ్యమున గలుపుకొనెను.

ఈచరిత్రాంశములు బీజప్రాయములై కుమారరామనాథ పురాణోత్పత్తికి కారణభూతము లాయెను న్యూనిజు కాలముననె మార్పు ప్రారంభమైనది; కన్నడ కుమారరాముని కథలో కల్పనా కథల లరణ్యమువలె బెరిగి వాస్తవచరిత్రను గప్పిపుచ్చినవి. ‡ఆంధ్ర కుమారరాముని కథయందు సత్యము సంపూర్ణముగ సమసిపోయి యాకాశపురాణమున కెడమిచ్చినది. చరిత్రాంశములనుండి యసత్య గాథలె ట్లుప్పతిల్లునో కుమారరాముని కథ చక్కగ విదితము సేయుచున్నది.

త్యాగరాయనగరు, మద్రాసు.
10-2-1953

నేలటూరు వెంకటరమణయ్య

# కుమారరాముని కథ



ఇది కథ ; యిది మార్గము ; వినిపింతు వినుడి ; ఓపుర జనులార ! పుణ్యాత్ములార ! అదియెట్టి కథ ? అనగ ఆవగ వినిపింతు ; ఆయట్టి విరుపాక్షి ఆనెగొంది భూమి ; కంపిలి గంగావ తనియేటి గ్రామదేవతయు, వీరకుంభిణి రాజు విక్రమార్కుండు, అతనికి నిజరాణి అలికులవేణి, (అరియాల యని యేటి యంభోజనేత్రి.*)

ఉత్తరకాంభోధి యన్నదే వసవల్లి దుర్గము ; ఆ వసవల్లి యేలేవారు యెవరంటె ? రాజు వీరకుంభిణి మహారాజు ; ఆ రాజుకు ఇల్లాలు అరియాలదేవి ; పుట్టే పన్నెండు పెరిగే పన్నెండు, పన్నెండు పన్నెండు ఇరువైనాలుగు యేండ్లు వెళ్లెను ; నగర సంతానం లేక నోయరాని నోములు, పట్టరాని వ్రతాలు, ఆకల్లా పత్రిగా నోచెను. రావిచిలుక నోము నోచెను ; కాశీ తీర్థం గంగకు మోచెను; గంగతీర్థం గాశికి మోచెను; కాశీరామేశ్వరం సందున చాలురావులు వేయించెను ; పర్వతంబోయేటి మార్గంలో పదివేలకు జంగమార్చన చేయించెను. అందునా సంతానఫలము అందదాయెను. పెండ్లిండ్లు లేని పేద బ్రాహ్మణులకు పెండ్లిండ్లు చేయించెను ; వడుగులు లేని పేద బ్రాహ్మణులకు వడుగులు చేయించెను; మిట్టను బావులు, పల్లమున చెఱువులు గోపి (?) ఒకట వనాంతరము వేయించెను. అందునను సంతాన ఫలము లేదాయెను. ఒకనాటి సమయమందున పెని

---

* ద్విపద పోలికలు ఇందు స్పష్టముగ గానవచ్చుచున్నవి. కొంచెము మార్చిన దీని మంజరి ద్విపదగ బరింపవచ్చును. చూడుండు.

ఇద కథ ఇది మార్గ మినిపింతువినుడి
పురవాసి జనులార ! పుణ్యాత్ములార !
అది యెట్టికథ యన గనగవినిపింతు
అట్టి విరూపాక్షియనగొంది భూమి
గంగావతని యేటి గ్రామదేవతయు
వీరకుంభిణిరాజు విక్రమార్కుండు
అతనికి నిజరాణి యలికుల వేణి.

మార్గమినిపింతు = మార్గము + ఇనిపింతు—'ఇనిపింతు' వినిపింతునకు ఆభాసరూపము—ఇట్టి రూపము లీపాటయందు త్రవ్వితండములు.

మిటి వీరకుంభిణి మహారాజు కచేరికి వెళ్లి, కచేరి బారకాస్తు చేసి, నగరుకు ప్రవేశించి, వెండికాగుల నేతినీళ్ల పైండికాగుల నల్లనీళ్లతోను రాజు స్నానం చేసి, పట్టు ధోవతులు అలంకరించుకొని, చేర్పునకు బొట్టు పెట్టుకొని, రాజు వచ్చేవఱకు బంగారపు పళ్లెరములో పప్పులు, పచ్చళ్లు, వంగ నాక్కూరం, నెయ్యి, అన్నము, నేతిబూరెలు రాజేంద్రునికి వడ్డన చేసిరి. రాజేంద్రుడు భోజనముజేసి హస్తములు వెల్చుకొని వట్టివేళ్ల చావికెలో పట్టుపానుపం గాలీసు దిండు మీద దీనాప దిండ్లు, వేపుదిండ్ల పానుపుమీద సిమ్మళించెను. సమయమందు పట్టపుదేవి తాను తలఆర స్నానం చేసి నేసువారిముల గాజుల్ని ధరించుకొని పోమళ్ల చీరె పట్టపుదేవి శృంగారించుకొని కుంకుమపచ్చలు, బాగిబంగాలు, బపిరి రేకలు, సూర్యవంకలు, చంద్రవంకలు, పాంజేబులు, పావడములు, చిటికెన బొద్దులు, పిల్లాణులు, గజ్జల వొడ్డాణం ఘల్లున ధరించుకొని బంగారు పళ్లెములో పండుటాకులు, పచ్చిపోకలు పెనిమిటిగారికి తాంబూలం చేసి యిచ్చుకొని అంబుజాక్షి, పద్మాక్షి, నీలవేణి ముగ్గురు దాసుల వెంటబెట్టుకొని రాణిగారున్న అంతఃపురంబులోనికి ఘల్లుఘల్లు మంటు చకచకగా వచ్చి పన్నెండు మూళ్ల పట్టుసెల్లా అడ్డతెరలు కట్టించి ఆ తెరచాటున కుర్చీ వేసుకి కూర్చుండి యీ పండుటాకుల, పచ్చిపోకల పచ్చకర్పూరమున పెనిమిటికి తాంబూలము ఇప్పించుచు,

ద్వి॥ "ఓ జీవితేశ్వరా! ఓ ప్రాణనాథ!
రాజమన్నె కొమార! రాజగంభీర!"

'విన్నావా స్వామీ! మనవి చేయుదును'

'ఏమి మనవి?' అని రాజు అడుగుచున్నాడు.

'మన యీడువారిలో, మన జోడువారిలో, సిరి సంపదల తులదూగుచున్నారు; స్వామీ! మన నగరను సిరి గిలిగిలుచున్నది, సంతానము లేక పోయెను. నన్ను 'అమ్మా!'—అని పిలుచుటకు ఆడబాలకన్నను నోచుకోనైతిమి. నిన్ను 'అయ్యా!'—అనిపిలుచుటకు మగబాలునికన్న నోయమైతిమి. సంతులేని వారి యిండ్లు కందులు గొట్టిన కళ్లమును, దేవుడు లేని దేవస్థలములను బోలును. మనకు ఏడుకోట్ల పదార్థమున్నది. ఎక్కే తురంగాలు గలవు; వలడానికి భూములు ఉన్నవి; కట్టుమట్టున యేనుగు లుండేమి, లేక నేమి? గొడ్డుబోతుబ్రతుకు బ్రతుకుటకంటె అడవిలోనొక బ్రహ్మాన్న బ్రతుకుట మేలు. స్వామీ! నీ సెలవే గనుక అయితే ఇక్కడకు పన్నెండు ఆమడ వానరభూమిలో శ్రీరాములవారి పర్వతము ఉన్నదట. ఆ పర్వతమునకు నేను వెళ్లి అఘోరమైన తపస్సు చేసి గట్టిగా నేను సంతానఫలమును తెచ్చెదనయ్యా స్వామీ!'

'అయ్యో! పట్టపుదేవీ! నీవేమి, శ్రీరాములవారి పర్వతము వెళ్లడమేమి? ఎండకు తాళలేవు, నీడకు నిలువలేవు, చూడ సుకుమారివి, తక్కువ నోములను యెక్కువ ఫలములను రమ్మనిన వచ్చునా? మనకు బ్రహ్మయింతే వ్రాసినాడనుకొందము. ఈ గండభేరుండములుండే అడవులలోనికి యెట్లా పోవుదువు?'

అనగానే!

'ఎంత లేదు, స్వామీ! మనకు సిబ్బంది లేదా? నీసెలవు అయితే పోవను గలను, రానుగలను.'

'ఎవరయ్యా, ప్రధాని అభోజి పంతులు, పట్టపుదేవి పిచ్చితలపు దలచెను. అడవులు బట్టుక శ్రీరాములవారి పర్వతము వెళ్లుచున్నదట. కాపులు, కరణములు, కమ్మవెలమదొరలు, చౌదర్లు, విద్వాంసులు, చెలగి మహల్‌దార్లు, ఉక్కురథములవారు, కంచురథములవారు, పచ్చబద్దలవారు, ఏనుగులకు వైరి ఎనబోతుల ఎఱ్ఱన్న, గుఱ్ఱములకు వైరి గుజ్జల పాపయ, పటాని పాగారాతు, ముగ్గురు సరదార్లతోగూడ పట్టపుదేవితోకూడ వెళ్లు'మని రాజుగారు సెలవుఇచ్చిరి.

పచ్చల పల్లకీ బైటబెట్టించిరి. శ్రీరాములవారికి ఏమి తీసుకున్నది? ఏదుము వెండిపూవులు, పందుము బంగారు పూవులు, పందుము సాంబ్రాణి, మూడుపుట్ల అచ్చపు ఆవుల నెయ్యి, స్వామివారి అఖండమునకు తీసుకున్నది. తూరుపుకుంభిని, పడమట కుంభిని, ముత్తరాసబలములు, ముద్దుబలములు, సదురు బోయగుంపులు, ఎఱ్ఱగొల్లగుంపులు, గొట్టెగాని బలములు హాజరుగ నడుములు గట్టుకొని నిలబడిరి. పట్టపుదేవి ప్రయాణము అవుచుండగానె పట్టపుదేవికి పుట్టింటివారు అరణం యిచ్చిన దాసీ నీలవేణి, దానికిగూడ సంతానము లేక పట్టపుదేవియే నోములు నోచినను తానును ఆ నోములు నోయుచు నుండునది; ఏ వ్రతములు పట్టినను ఆ వ్రతములు పట్టుచునుండెడిది. పట్టపుదేవి యెక్కడికి వెళ్లినను 'వచ్చెదవటె దాదీ సంగా!'—అని పిలుచుచుండెడిది. ఆలాగంటెది శ్రీరాములవారి పర్వతము వెళ్లునప్పుడు నీలవేణి అనుదాసిని తలచినదే కాదు. పచ్చల పాలకీలో కొలువు దీరెను. గుఱ్ఱములమీద ఢంకా ఢాంఢాం అని మ్రోగువఱకు, దండంతయు ప్రయాణమయి చక్కగ వచ్చెను. ముందుగానే పట్నమంతా కస్తూరి కలాపి చల్లించి, రంగవల్లి ముగ్గులు పెట్టించి, వీధి వీధిని తోరణములు గట్టించినారు. దాదులు యిద్దరు ప్రయాణమై వెంబడించి వచ్చుచున్నారు. నీలవేణి, 'పిలువనిది ఎందుకు పోవలెను?' అని యింటియొద్దనే నిలిచినది.

అరియాలా దేవేమి
శ్రీరాముల పర్వతము॥తందన్న తానా॥
భామతాను కదలినది
కొమ్మకొమ్మ దివిటీలు తం॥
కొత్తులావిపంజులు
రంభనాటక స్త్రీలేమి
సకలవిధాల సంబ్రముల
భామతానుగదలెను;
వసవల్లి దుర్గము తం॥
చుట్టు యేడుకోటలు
సూర్యసోమ వీధులు
వారలుచాల గడచిరి;
పొడుగాటి మిద్దెలు తం॥
భువనేశ్వరము లేమి
వారుచాల దాటిరి;
కొండలు కులగిరులు
గంగరేగులు గడచిరి; తం॥
పెద్దపులులు పేరాడె
వనములు వారు దాటిరి;
సాంబ్రాణిసాదులు
వారు చాల దాటిరి;
మైసాదున్న వనములు
వారు చాల గడచిరి;
ఆరగ పండిన మావిళ్లు
వారుచాలదాటిరి;
వానరభూమికి వచ్చిరి;
శిలానది దగ్గరను
పాతాళగంగేమి
అక్కడ డేరా వేసిరి.
అక్కడికి, మూడు కోసులు ఉన్నది
శ్రీరాముల పర్వతము

అఘోరఘోర అడవేమి
గుజ్జు కత్తులు సేయించి
పెడకత్తూలె సేయించి
గొడ్డళ్లు సేయించి
మూడు కోసుల పొడుగున
అడవి యంతయు గొట్టిరి
దారులు బాగుగ దీర్చిరి
వచ్చి కబురులు చెప్పిరి,
'దారులు బాగుగ జేసితిమి.'
అప్పుడు, గంగిలో స్నానముచేసినది॥తం॥
పట్టు వస్త్రము గట్టెను
కొన్ని బలములను దీసికొని
ఆటపాటల వారిని
ముందుగను నడపించి
వెనుకకు, అడుగుకు మడుగు లొగ్గెను
వడకు అడుగుల నొగ్గుచును
పర్వతము మీదికి వచ్చినది.
శ్రీరాముల దేవళము
తెచ్చిన సామానంతయు దింపించి
అయిదు బిందెల ఉదకము
స్వామివారికి ఆవేళ
అభిషేకము సేయించి
యేనుము వెండి పువులేమి తం॥
పండుముపై డి పుష్పలేమి
స్వామి వారికి పూజలు సేయించి
పండుముగ సాంబ్రాణి
స్వామివారికి ధూపము వేయించి
ఎదుట అఖండము నెత్తించి
సాష్టాంగము సేవించి
ఆ దేవళము ముందరను తం॥
సూది గుండు ఉన్నది

నరు లెక్కలేరు దిగలేరు
ఆ సూదిగుండు మీదికి
భామతాను ప్రాకెను.
దర్భాసనము పరచినది
దర్భాసనము మీదను
పులిచర్మము పరచినది తం॥
పైన జింకచర్మము పరచినది
జింక చర్మముమీదను
గుమ్మడి పండును నిలిపెను
గుమ్మడిపండు మీదను
సూదిమీద సూదేమి
యేడు సూదులు నిలిపెను తం॥
చివర సూదిని అరియాలి
ఆవగింజను నిలిపెను
ఆవగింజ మీదను
శిరస్సు క్రిందు మోపినది
శ్రీపాదము మీదేమి
భామ తపస్సు పట్టింది.
మూడు గడియల తపస్సుకు
చుక్కలు పిక్కటిల్లెను
సూర్య చంద్రాదులు తం॥
త్రోవలు తప్పెడు విధమాయె
భూమి తల్లడిల్లెను
నీళ్లకు చెదలు పట్టెను
అగ్నికి యీగలు ముసిరెను.
అప్పుడు స్వామివారేమి
గడగడ గడగడ వణకుచును తం॥
అబ్బ! ఎంత తపస్సు పట్టినది!
నేను చూడలేనేమి
అంటు ప్రత్యక్షమైనాడు.
'వినావా! అరియాలీ,
నీకు ఇంత కష్టమెందుకు?
నీకు కోరిన ఫలములు యిచ్చెదను
అడిగిన వరములు యిచ్చెదను తం॥
నీ తపస్సు వదలి చెప్పవలె
నమ్మ వేమే అరియాలీ? తం॥
నీవు నమ్మవే ముమ్మాటు
నీ వడిగిన కోర్కెల నిచ్చెదను.'
అపుడు తపస్సు వదలినది
హస్తములట్టె యొగ్గినది,
'మీరు యిచ్చిన భాగ్యము
మాకు, యేడుకోట్ల ధన మున్నది
బొక్కస బండా రున్నది తం॥
భోగభాగ్యములు గలవయ్యా
యేలు భూము లున్నవి
ఎక్కుగుఱ్ఱము లున్నవి
'అమ్మా!' యని పిలిచేటి
ఆడబాలా లేకను తం॥
'అయ్యా!' యని పిలిచేటి
మగబాలుడు లేకను
నేను ఈడకు వచ్చితిని
నాకేమి వర మొద్దు
సంతాన మివ్వండి.'
అట్లు హస్తము లొగ్గినది తం॥
స్వామివారు మెచ్చిరి
మెచ్చి ఫలము లిచ్చిరి
'నీకు భామేలె పుత్రుని
మగబాలు నిచ్చేదా?
లేకాడబాల నిచ్చేదా?'
'భామేలే పుత్రుని
మగబాలు నివ్వండి
ఆయురారోగ్యము దీవించి.

'విన్నావా! అరియాలీ,
నా దేవళము వెనుకను
అరటితోట ఉన్నది
అంటితోట లోపలను
చెట్టున, అయిదుపండ్ల గెలయున్నది
అందులో నొక్కపండు దెమ్మనెను.
'మంచిది' అనుచును తం॥
రామస్మరణ జేయుచును
అరటి తోటకు వచ్చినది.
పైన చెట్టువంకను చూచెకదా!
అయిదు పండ్ల గెలయున్న
చెట్టుచుట్టు అరియాలి తం॥
ప్రదక్షిణము చేసెగద.
స్వామి ఒక్క పండు దెమ్మంటె,
అయిదు పండ్ల గెల గోసి
కోసి చెట్టు దిగినది,
ఒక్క పండే యున్నది
చెట్టువంక జూచెను
నాలుగు పండ్లు పైనుండె. తం॥
'నేను తక్కువ నోములు నోచితిని
యెక్కువ ఫలము వచ్చెనా?
అయినను దేవతా మహిమలు
ఒకటను రెంటను మూటను
తప్పిన నాలుగింటను.' తం॥
రెండవపారి యెక్కెను
ఆ నాలుగు పండ్లను గోసినది.
చెట్టు దిగెను హరియాలి
ఒక్క పండే యున్నది
నాలుగు పండ్లు పైనుండె;
మూడవపారి కోసెను
ఒక్క పండే యున్నది.
స్వామి ప్రత్యక్షమైనాడు తం॥
'ఇది యేమే! అరియాలి,
నీవైతె ఆశకు పోయితివి
నీకు భూమేలే పుత్రుని
జగమేలే చంద్రుని
కొడుకునైతే ఇచ్చితిని.
ఒక్కడే చాలును. తం॥
నీకు బాలుడు కలగగను
చిన్నవానికి నీ వేమి
కుమారరామ య్యనియేటి
పేరు బెట్టుమన్నాడు.
నీ యొక్క బాలునకు
కత్తి దెబ్బ తగులదుగా
తుపాకి దెబ్బను చావడుగ
అట్లు నీకు యిచ్చితిని తం॥
ఒక్క పండే చాలును.'
స్వామి సెలవు తీసికొని
దండముబెట్టి తిరగినది
పర్వతంబు దిగినది తం॥
శిలానది యొద్దకు
డేరాకు వచ్చెను. తం॥
బంగారు భరణిలో
అరటి పండే యుంచెను
తన పలకిలో నుంచుకొని. తం॥

మా. 'ఎవరోయి ఏనుగలకు వైరి ఎనుబోతుల యెజ్జన్న, గుజ్జములకు వైరి గుజ్జుల పాపయ్య, పటాణి పాగారాతు.'— మేలు మేలు!

'మన బాహుబలముకు పైనము చెప్పు'! మన్నది. దరోబస్తు సిబ్బందీ
-ారు అందఱు నడుములు గట్టుకున్నారు. డేరాలన్ని ఒంటెల మీాద బరువులు
ట్టినారు.

-ెగి వసవల్లి దుర్గముకు
-ామ వచ్చుచున్నది
-త్తాల మీాద ఢంకాలు
-బులుగ వేస్తు వచ్చిరి
-యింబగలును నడచిరి తం॥
-ాడవరోజుకు అరియాలి
సవల్లి దుర్గము
-ఠరి ముందఱ దిగిరి.
-ోడాల బిలిపించి,
విన్నారా జోడాలు,
యిందు, పట్నమునకు మీారెళ్ళి తం॥
-ాజగారితో చెప్పండి
ట్టపు దేవి వచ్చెను
-లములు దెచ్చుచున్నది
-లాగంట చెప్పండి.'
-ుందర వచ్చిరి జోడాలు
రాజుగారి కొల్వునకు తం॥
-స్థానమున నిల్చిరి.
-ోడాలవారిని జూచెను,
ఏమిరోయి! జోడాలు,
-దిర పట్టపు దేవేమి ?'
అయ్యా! వచ్చుచున్నది
ఫలములు దెచ్చుచున్నది.'
అంగానె రాజుకు
కుప్పటము యెగసెను
కుడిభుజములు అదిరెగద తం॥
నూఱు భుజములు ఆయెగదా!
ఇన్నాళ్ళకు మనసగర

సంతానము తెచ్చేనా ?'
సంతోషించి రాజేమి
పట్టపు దేవికి యెదురుగను
పాలకి భజంత్రీల బంపె గదా
నాలుగు వీధులు మహారాజు తం॥
తోరణములె కట్టించి
సకల వగల సంబ్రముల
పట్టపుదేవియు నారాజు
నాలుగు వీధుల నూరేగి తం॥
మొగసాలకె వచ్చిరి.
వచ్చిన మరునాడు
దశమి సోమవారమున
దండి ఒక్క ప్రొద్దుండి
కన్నెకల భావికి
స్నానమునకు వచ్చెను.
అక్కడ స్నానము చేసినది
దానధర్మములు జేసినది తం॥
పట్టువస్త్రము గట్టుకొని
తన మేడకు వచ్చెను.
బంగారు గిన్నెలో
అరటిపండె యుంచినది
ఆ తొారకంతటిని ఉలిచినది
శ్రీరాములను నుతియించి
పండును అనుభవించినది
తొారకను పారవేసినది.
అది పుచ్చుకున్న గడియకు
జిల్లేడాకు పాలిన
పాలిన ఒక్క చందమున

దేహమంతయు బాలెను;
తమలపాకు చీకిన
చీకిన ఒక్క చందమున
దేహమంతయు చీకెను; తం॥
అన్న హితవు తప్పెను
వేవిళ్లు ఘనమాయె.
వెలది చిన్నెలు అరియాలి
మూడవ ఒక్క గడియకు

ముత్తె మంత పిండము
ముద్దు మీఱ నిలిచెను;
పగడమంతి పిండము
పాడుకాడె గర్భమున;
ఆఱుగడియల గర్భము
పట్టపు దేవికి నిలిచినది.
అంతఃపురమున బడియుండె
నీలవేణి వచ్చినది. తం॥

మా. అది కంటికి కడవెడుగా దుఃఖపడుచు ఉన్నది. 'అయ్యో! పట్టపు దేవికి నేనేమి నేరముచేసితిని, నేనేమి ద్రోహముచేసినాను? పోవునప్పుడు 'దాదీ సంగా, వచ్చెదవా', అనిన నేనుకూడ పోయి ఉందు గదా! తనకువలెనె నాకు సంతానము దొరకు గదా! నాకు భగవంతుడు వ్రాయలేదు కాబోలు' అని దుఃఖపడుచు పట్టపుదేవి ఉండి పోయిన మేడలోనికి వచ్చెను. అరటి పండు తోలు నట్టింట పడియుండగాచూచి, 'కానీ, పండునే పుట్టినదె తోలక, తోలకను పుట్టినదె పండు, పండు దినిన సంతానము కలిగినట్టున్న తోలకదినిన లేక పోయి నట్టునా?' అని, 'శ్రీరాములు, నీవే కల'వని సగం తోలక అనుభవించెను. రాజుగారి గుఱ్ఱమునకును అనేక దినములనుంచి సంతానము లేక గొడ్డు వీగి ఉన్నది. ఇది యెవరితో చెప్పక పచ్చని గడ్డిలో సగముతోలక పొదిగి,

గుఱ్ఱమునకు బెట్టినది తం॥
దానికి గర్భమునిలిచెను.
తనుపుచ్చుకున్న గడియకు
జిల్లేడాకు పాలిన
పాలిన ఒక్క చందమున
దేహమంతయు బాలెను
తమలపాకు చీకిన
చీకిన ఒక్క చందమున
దేహమంతియు జీకెను.
అన్నహితవు తప్పెను తం॥
దాహహితవు తప్పెను

దాది సంగకు నిలిచినది.
అదియెవ్వరు యెరుగరు
తానింటిలోపల బడియుండె. తం॥
మూడు గడియల ప్రొద్దెక్కి
అరియాల దేవేమి
కష్టము పడుచు నున్నది.
'అయ్యో! రారే దాదులు!
కావేరీ! కస్తూరీ!
ఈవేళ నేను బ్రతుకనె.' తం॥
'అమ్మా! ఓర్చుకో మాతల్లీ'.
తాళితాళి నొప్పులు

ఇంత వర్తమానము
రాజు చాల విన్నాడు. త॥
ఎంత కష్టమువచ్చినది.
మంత్రసానుల బిలిపించె;
ముప్పైముగ్గురు వచ్చిరి.
పొడుగాటి పీటలు
పట్టపుదేవికి వేసిరి
భామను గూర్చునబెట్టిరి,
వెనుకను ముందున ఆనుకొని
ముందు దూలమున పలుగులు తం॥
పట్టపు దేవి చేతికి
వారు అంది యిచ్చిరి.
అంతలోనె మహారాజు
భోజనముజేసి యా రాజు
కచ్చేరికి వెళ్లెను.
అయిదు గడియల ప్రొద్దెక్కె తం॥
హారియాల దేవేమి
చల్లంగను నిల్లాడె.
కొడుకైతె కలిగెను
'మగబాలుడు' అన్నారు.
బాలకు బొడ్డు గోసిరి
బాలకు నీళ్లు బోసిరి

బంగారంపు తొట్లోను
బాలుని దీసుక వచ్చిరి
తబుకుతో వరహాల్ త్రవ్విరి తం॥
సత్కా తీసిరి బాలునికి
అవల నీవల జల్లిరి
దాదులు ఈసు లేరికొని
బాలుని తొట్లలో నుంచిరి.
'మూడు పుట్ల బియ్యము
మంత్రసానుల' కన్నారు.
పాతిక వరహాల్ పైనిచ్చి,
తవుడున యుల్లి పొట్టున
తగ పొగ వేసిరి బాలునికి.
వాకిట వేషమండలు కట్టిరి,
చుట్టు దాదులు కావలి.
అప్పుడు హారియాలి
తెనమూర్ఛ దెలుపుకొని
'ఏడమ్మ! నా బిడ్డ?'
బాలుని చేతికి ఇచ్చిరి.
దూది బొమ్మన ఆ తల్లి
స్తన్య పాన మిచ్చెను.
ఈ వర్తమానము

మా. నగరి కొమాళ్లు రాజుగారి కచేరికడకు వర్తమానము దీసికొని వెళ్లుచున్నారు. అంతలో వైళెమె రాజుగారు మేలు మేలు!

సాలుగుదస్తా లెక్కలు కంఠీపట్టించగా తమ ఖర్చు సిబ్బందీ ఖర్చు అర మాఫీ పురుమాఫీ ఖర్చుపోగా సరకారు సిస్తు చెల్లగా ౧౮౨౦౦ వరహాలు రాజుకు ఆదా కనుపడినది. అగుపడగానే బహు సంతోషముతో నున్నాడు. ఆ సమయములోనే నగరికొమాళ్లు వెళ్లి, 'మహాప్రభో తమకు కుమారుడు గలిగినా'డని చెప్పగానె, రాజు బహు సంతోషించి పుక్కిట విడెము చెదర నవ్వి,

'ఎవరయా! అభోజిపంతులు, శీఘ్రముగా పట్టములో బ్రాహ్మణులను

పిలిపించి చిన్నవాడు పుట్టిన గడియ నక్షత్రము విచారించవలెను. అతిత్వరగా పిలిపించ' మనెను.

ప్రధాని వెళ్లి బ్రాహ్మణులను పిలుపించేవఱకు రాజుగారు పన్నెండుపుట్ల కండచక్కెర, యెనిమిదిపుట్ల పంచదార, ఆఱువందల ఆకుల మోదలు, పందుం పోకలు పట్టము వెడల్పున పంచి పెట్టించిరి. అంతలోనే బ్రాహ్మణులందఱు హాజరు అయినారు. 'ఎవరయ్యా, బ్రాహ్మణోత్తములారా! పట్టపుదేవి పుట్టి పన్నెండు పెరిగి పన్నెండు, పన్నెంట పన్నెండు యిరువైనాల్గు సంవత్సరములకు సంతానము దెచ్చెను. మగచిన్నవాడు జననమైనాడు. తల్లికి మోసమో, తండ్రికి మోసమో, పట్టమునకు యేమైన భయమేమో, యేడు కుంభిణీ కోటలు, డెబ్బైరెండు కరవట్నాలు, యేనూట యెనభై రాజవీథులు, యేనూట యెనభై సందువీథులు ఉండునో? ఊడునో? చిన్నవాడు పుట్టిన గడియ నక్షత్రము యేలాగున్నదో? నేను రాజరికము చేయు రాజనని భయపడక గట్టిగా విచారించండి'.

'మహాప్రభో, ఇంకను మీరు అడుగ పని ఉన్నదా? మేము చెప్ప పని ఉన్నదా? చిన్నవాడు పుట్టినగడియ నక్షత్రము బహుబాగుగ ఉన్నవి.
మేలు మేలు!

భూమినేలు పుత్రుడు పుట్టనే పుట్టెను. తల్లికి మోసము లేదు, తండ్రికి మోసము లేదు. పట్టమునకు మోసము లేదు. ఏడు కుంభిణీకోటలు డెబ్బైరెండు కరపట్టములకు మోసము లేదు. కుమారుడు బహుబుద్ధిమంతుడగును. రాజు అంశ బాగుగ ఉన్నది. ఒకట రెంట మూట గట్టిగా విచారించియే మీతో మనవి చేసినాము.'

అనగానే అప్పుడు బ్రాహ్మణులకు పప్పు బియ్యములు ఇప్పించి దుశ్శాలువలు
మేలు మేలు!

బహుమానం యిప్పించి రాజుగారు కచేరి బరఖాస్తు చేసి రాయమహల్ మీద పండుకొన్నాడు.

దాది సంగ యిక్కడను
కష్టపడుచు నున్నది తం॥
అయ్యో! రావే కావేరి,
అప్పా! నేను బ్రతుకనె
చెల్లీ! రావే పద్మాక్షి

యీవేళ నేను బ్రతుకనె.
మంత్రసానిని పిలచిరి
తాళి తాళి నొప్పులు తం॥
తడవాయ నిల్వవు.
ఆవల యీవల దాదులు

నిల్వ బట్టిరి ఆవేళ
మంత్రోదకములు తెచ్చిరి
నీలవేణికి యిచ్చిరి. తం॥
పగలు రెండు జాముల వేళను
దాది సంగకు ఆవేళ
కుమారుడు కలిగెను
అప్పుడు మంత్రసానులు
బాలుని బొడ్డు గోసిరి,
నీళ్లుబోసిరి బాలునికి
ఉయ్యాలతొట్లలొ నుంచిరి.
నీలవేణి లెగిసినది,
మూర్ఛ పోయి లెగిసినది. తం॥
'యేడమ్మా! నా బిడ్డ ?'

ఎత్తి చేతికి ఇచ్చిరి.
దూదిబొమ్మున పాలిచ్చె
నీలవేణి కొడుకేమి
రాజు కొడుకు కన్నాను
చింతాకు వాసేమి
సౌందర్యము గలవాడు,
అధిక చక్కని బాలుడు.
రాజుగారి గుఱ్ఱము
పూల తోటలో ఈనినది
నాలుగు కాళ్లు తెలుపేమి
నడినెత్తిన చుక్కేమి
పంచకల్యాణి పూదోక
మంచి గోడిగను పెట్టినది. తం॥

మా. దాది సంగకు కుమారుడు కలగంగానె, గుఱ్ఱమునకు గోడిగ పుట్టగానె, రాజుగారి కచేరీమీద యేమేమిచోద్యములు పుట్టుచున్నవి? రాజు ఒక్కడే కచేరీన లేడుగాని సకలమైవారు కచేరిలోనే యున్నారు ఏనుగులకు వైరి ఎనపోతుల ఎఱ్ఱన్న, తెలగా గుఱ్ఱములకు వైరి గుజ్జుల పాపయ్య, బొందిలి పరాణి పాగారాతు తురక ముగ్గురు సరదార్లు ఏమనుకున్నారనగా:-

పరాణి పాగారాతు అన్నాడు గదా,

'ఏమోయి, ఏనుగులకు వైరి ఎనుబోతుల ఎఱ్ఱన్నా, సిపాయిగిరి బంత్రాతుమానా యెవ్వరిదోయ్ ?'

అనగానె,

'ఒకరిది అని నిరుకు ఉన్నదా ? ముల్లత్రాడు గట్టిన మగవాడి కెల్లను ఉన్నది సిపాయిగిరి బంత్రాతు మానా.'

అందుకు తురక యేమంటాడనగా,

'సిపాయిగిరీ బంత్రాతు మానా యెవ్వరిదీ కాదు, మేలు మేలు! మాషేఖుయింటి వారిది.

డాలు పట్టా యెవ్వరిది ?
సైయ్యదు యింటి వారిది.

బల్లెపు లగువులు యెవ్వరివి ?
మామొగలు యింటి వారివి,

మా. అందుకు ఎఱ్ఱన్న యేమి అనుచున్నాడు:

'కయితే డాలు బల్లెము పట్టా మీ సైయదు మొగలు ఇంటి వారికే అయితే ఈభూమిలో సిపాయిగిరి మఱియెవ్వరికి లేదా? వెఱ్ఱి మాటలు యేమి చెప్పుచున్నావు! మేలుమేలు!

మొలత్రాడుకట్టిన మగవానికెల్లా ఉన్నది, బంట్రౌతుమానా, సిపాయిగిరి.'

ఎఱ్ఱన్నతో తురక యేమనుచున్నాడు.

'ఛీ, లండి' అనుచు తిట్టెను.
'నన్ను లండి అనుచు తిట్టితివా?'
తెలగాలు లెగిసిరి
బొందిలీలు లెగిసిరి.
పట్టాలు దూసిరి
కత్తులట్టె దూసిరి.
తురకలంత లెగిసిరి
నడుము లట్టె కట్టిరి
డాలు కత్తులు దీసిరి
కదిసెనుర! కయ్యాము. తం॥
తురక లప్పుడు నఱకిరి
తెలగాలు పొడిచిరి
బొందిలీలు నఱికిరి.
ఓహో! కదిసెర కయ్యాము.
ఆఱునూటికి చావులు
మూడు నూర్లకు గాయములు

మా. కచేరీ అంతయు నల్లకల్లోలము అయినది. ఆ రక్తకోకలు మూట లుగట్టించి, రాయమహల్ మీదికి తీసికొనివెళ్లి, 'ఓహో! వీరకుంభిణి మహా రాజుగారు, ఏమి నిద్దుర పోవుచున్నారు ఏలినవారు?'

అనగానె, దిగ్గున లేచి,

'ఏమర్రోయి!' అని రాజు అడుగగా,

'మహాప్రభో, యీవేళతో కచేరీ అంతయు పాడైపోయెను.'

అనగానె, రాజు వెలవెలబోయి,

'అదియేమి?' అని అడుగుచున్నాడు.

'ఏనుగులకు వైరి ఎనపోతుల ఎఱ్ఱన్న, మేలు మేలు!
గుఱ్ఱాలకు వైరి గుజ్జుల పాపయ్య, పఠాణి పాగారౌతు మూలముగ కచేరి మీద కార్యము పొసగినది.'

'అది ఏలాగంటిది? ఎట్లు పొసగినది కార్యము? నాకు తెలియజెప్పుము' అని రాజు అడుగగనె, కచేరీన వారిలో వారికి నడచిన సంవాదము మీద పుట్టిన కార్యము చెప్పగానె, రాజుగారు యేమి చెప్పినా రనగా,

'నేను ఈలాగంటి సంగతులు పుట్టునని ముందుగానె జాగ్రతపడి పట్టము లోని బ్రాహ్మణులను పిలిపించి చిన్నవాడు పుట్టిన నక్షత్రము బాగుగ నున్నదా?

అని అడిగితే, మేలు మేలు!
భూమి నేలే పుత్రుడు, జగమేలు చంద్రుడంతటివాడు పుట్టెను. తల్లిదండ్రాదులకు మోసము లేదు, పట్టణమునకు మోసము లేదు అని చెప్పిరి. నేను వారికి బహుమానములు యిప్పించి రాయమహాల్ మీద పండుకొని యున్నాను. నిద్దుర పట్టుచున్నది. ఇంతలోనె యింతకార్యము యెక్కడనుంచి వచ్చెనోయి? పిలుపించండి, మునుపటి బ్రాహ్మణులను ఇప్పుడు.' అని దివాణ్ అభోజపంతులకు జెప్పెను. 'దాయలు గట్టి బ్రాహ్మణుల శిరస్సులు కొట్టించెదను.' అనగానె ప్రధాని గడగడ వణకుచు 'బ్రాహ్మణులకు నేటికి మూడెకాబోలును,' అని బ్రాహ్మణుల నప్పుడు రాజుగారి కొలువుకు హాజరు చేయించెను. చేతులు గట్టుకొని బ్రాహ్మణులు నిలువబడిరి. మేలు మేలు!

'ఎవరయా బ్రాహ్మణులు? నేను ఒకపారికి రెండు మారులు మిమ్మల గట్టిగా విచారించచుంటిని, 'మరేమి పట్టణమునకు మోసము లేదు' అని చెప్పితిరి. ఇంతలోనె నా కచేరీలో ఆఋనూటికి చావు, మున్నూటికి గాయములు ఎట్లా ఆయెను?'

'మహాప్రభో, మనవి చిత్తగించండి. అప్పుడు ఒకమాట, యిప్పుడు ఒకమాట ఆడుదుమా మేము? మీ కుమారుడు పుట్టిన గడియ నక్షత్రమువల్ల యీలాటి కార్యములు పుట్టబోవు ఇంతకు ముందుగ ఈపట్టణములోను యేకోమటివీధినో యే బ్రాహ్మణగల్లీనో యే రాజవీధినో యే శూద్రశేణిలోనో యే మొగలాయివీధినో యే గొల్లవీధినో మహాచెడ్డ కార్యమంది పుట్టినాడయా.'

అనగానె,

'విన్నావటయ్యా! అభోజపంతులు, మన సిబ్బంది వారిలో దిట్టమైన వారిని పదిమందిని వెంట దీసికొని పట్టణము దరోబస్తు యిల్లిల్లు తప్పకుండ వెతికించి రెండు జాములప్పుడు మేలు మేలు!
యే యింట యే చిన్నవాడు పుట్టెనో ఆ చిన్నవానిని మన కచేరీకి హాజరు చేయించుము.'

అనెను.

'చిత్తము, మహాప్రభో!'
అని కత్తులు కటార్లవారిని యిరవై యింటికి, వెంటబెట్టుకొని పట్టణము లోనికి సాగివచ్చుచున్నారు.

అంతలోనె నగరికొామాళ్లు రాజుగారికి వర్తమానము పట్టుకొని వచ్చినారు. 'మహాప్రభో, మన దాది సంగ నీలవేణి అనే దానికి కుమారుడు కలిగినాడు.'

'ఎంతసేపు అయినది దానికి కుమారుడు పుట్టి ?'

'మహాప్రభో, రెండుజాము లప్పుడు దానికి కుమారుడు కలిగెను. ఇక నొక మనవి. నాటి మట్టీ మన గుఱ్ఱము ఒకటి గొడ్డువీగి వుండెనే, అది యీ వేళనె పూవులతోటలో యీనబడినది. మేలు మేలు ! పిల్లన్నను పిల్లగాదు. మంచి గోడిగపుట్టినది. నాలుగు కాళ్లును తెలుపు నడినెత్తిన చుక్కయు. పంచకల్యాణి, మహాప్రభో, అది బ్రతికితే పదివందల రూపాయలు చేయునండి.'

"ఎవరయా బ్రాహ్మణులు, పట్టపుదేవి అనేక నోములుపట్టి అనేక వ్రతాలుపట్టి, పన్నెండామడ శ్రీరాములవారి మేలు మేలు ! పర్వతమువెళ్లి కష్టపడి సంతానము తెచ్చెను. ఈ దాదిసంగ యెక్కడికిపోయి తెచ్చినది ? ఈ గుఱ్ఱము యెక్కడికిపోయి తెచ్చినది ?'

'మహాప్రభో, అదీ శ్రీరాములవారే దయచేసినారు.'

'విన్నారటయ్యా ! బ్రాహ్మణులారా, కష్టము వచ్చును. సుఖము వచ్చును. ఇది శ్రీరాముల సంకల్పము చొప్పననె జరుగును. అయితే, యీ చిన్నవాడు పుట్టిన గడియా నక్షత్రము చూడండయ్యా.'

అప్పుడు బ్రాహ్మణులు గట్టిగా విచారించి మేలు మేలు!

'మహాప్రభో, ఇంకను అడుగ పని యున్నదా ? చెడ్డకార్యవాది, శూరుడు పుట్టినాడయ్యా దాది సంగకు.'

రాజు కార్యవాది శూరుడనగానే,

'ఆ చిన్నవాడు ఏమిచేయును ? ఈ గడియ నక్షత్రమున పుట్టిన చిన్నవానికి యేమేమి గుణము లుండును ?'

అంటే,

'చోరవిద్య, జారవిద్య తఱచుగా మనుష్యులను చంపడము, యీమూడు గుణములు ఉండును, ౧౨ సంవత్సరములు వెళ్లినదాక.

ఆ పైన ఉండవటయ్యా. మేలు మేలు !

౧౨ సంవత్సరములు పోయిన తరువాత యీ దుర్గుణములు పోయి సద్గుణములు వచ్చును.'

అనగానె రాజుగారు యేమనుచున్నారు.

'ఈ చిన్నవానిని ఉంచడము కూడదు, చంపుడు

అనుచు సెలవు ఆయెను.

ఈ వర్తమానము దాది సంగవిని, గోడుగోడున దుఃఖపడుచు వచ్చి బ్రాహ్మణుల కాళ్ల మీదబడి 'నా బిడ్డను యేలాగైన బ్రతికించండయ్యా' అని అనంగానె బ్రాహ్మణులు, ఈ దుఃఖము చూడలేక రాజుగారితో నేమని మనవి చేయుచున్నారు.

'మహాప్రభో, చిన్నవాని జంపడము భావ్యముగాదు. నాల్గు సంవత్సరములు తల్లి దండ్రాదుల అదుపులో నుండును; నాల్గు సంవత్సరములు చదువు చెప్పు బ్రాహ్మణుని హదుపులో నుండును ; తతిమ్మా నాలుగు సంవత్సరములు సాధన చెప్పే జెట్టీల అదుపులో నుండును. అక్కడికి దుర్గుణముపోయి సుగుణము వచ్చును. ఇప్పుడు చిన్నవానిని జంపించిన శిశుహత్య చుట్టుకొను చున్నది.'

అనగానె రాజు,

'ఇదీ నిజమే. ఈ చిన్నవానిని దీసుకవెళ్లి మా చిన్నవానికి సహవాసముగా తొట్లలో నుంచుడు' అనెను.

దాది సంగ కుమారుని గూడ రాజుకుమారుని జతచు బంగారపు తొట్లలో నుంచిరి. మేలు మేలు !

పురుడు పుణ్యాహము వెళ్లెను
బారసాల వెళ్లెను
బాలుల జోడుగ బెంచిరి.
ఒక్క నెల గడిచెను
రెండవ నెల గడిచెను
మూడవ నెల రాగనె తం॥
అరియాల దేవేమి
భామస్నాన మాడెను
నగలన్నిటిని ధరియించి
పెనిమిటి కొలువుకు వచ్చెను.
'ప్రాణవల్లభ ! విన్నావ ?
జీవితేశ్వర ! విన్నావ ?'
'ఏమి మనివి చెప్పుమా.'
'బిడ్డల గన్న తండ్రివి
బిడ్డల గన్న తల్లిని
అయితేయేమి మన మేమి
మూడవ నెల వచ్చినది
నా బిడ్డకు పేరు పెట్టండి.' తం॥
'మంచి' దన్నాడు మహారాజు.
తెల్లవారిన తరువాత
'ఆ భోజీపంతులు, విన్నావా ?
బ్రాహ్మణుల ముగ్గురిని పిలిపించు.'
హాజరు చేసెను బ్రాహ్మణుల.
రాజు బ్రాహ్మణులు గూర్చుండి
'ఏమయ్యా ! బ్రాహ్మణులు,
వరముల దెచ్చిన బాలునికి
పేరేమని పెట్టుదుము ?'
'మహాప్రభో, విన్నావా, ?
నీ యొక్క కుమారుడు
పండు దినబుట్టిన బాలునికి తం॥
కుమార రామయ్యనియేటి
పేరు మంచిది, పిలువండి'

మా. 'కుమార రామయ్య, కుమార రామయ్య' అని బ్రాహ్మణులు

పిలచిరి; రాజు కచేరీన ఉండువారు అందఱు పిలచిరి; తల్లి పిలచెను; దాదులు పిలచిరి; రాజుకుమారుడు కుమారరామయ్య అని పట్ణము ప్రజలందఱు పిలచిరి.

'మఱి దాది సంగ కుమారుని యేమని పిలువనయ్య?'

'మహాప్రభో, పండున పుట్టినదె తొలక, తొలకను పుట్టినదే పండు. విచారించగ రెండును ఒకటిగానె ఉన్నది; దాది సంగ కుమారుని పోలిక రాముడు అని పిలుచుటకు బహుయోగ్యముగ ఉన్నది.'

బ్రాహ్మణులకు బియ్యం బేడలు వస్త్రములు యిచ్చి సాగనంపిరి. ఆ రోజున పన్నెండుపుట్ల బియ్యము వండించి శూద్రులకు అన్నప్రదానము చేయించెను.

మేలు మేలు!

ఆరోజున చిన్నవాండ్లకు
అన్నముకూడ ముట్టింది.
అట్లా [illegible]ది గడచెను
రెండవ యేడువచ్చెను తం॥
తప్పటి అడుగులు బెట్టునురు;
రెండేడ్లు వెళ్లెను
మూడవ యేడువచ్చెను
దూముదాముగ నడచెదరు
మాటలు బాగుగ వచ్చెను తం॥
బొంగరాలు ఆడుదురు
జర్రీ పట్టీ లాడుదురు
మూడేండ్లు వెళ్లెను.
నాలుగవ యేటను బాలులు
'అన్నయ్యా వచ్చెదవా?'
'ఎక్కడికి రాముడ?'
'పెద్ద బజార్లు చూచెదము'.
తండ్రి యెఱుక లేకుండ
కుళ్లాయీలు పెట్టిరి
జరి అంగరకాలు తొడిగిరి
రుమాల నడుముల గట్టిరి
చెట్ట పట్టాల్ పట్టుకొని
పెద్ద బజారుకు వచ్చిరి
అక్కడ కోమటివారి పిల్లలు తం॥
బ్రాహ్మణవారి పిల్లలు
జర్రీ పట్టీ లాడేరు.
'ఎవరోయి! పిల్లలు
మేము కూడ ఆడుదుమా?'
'రండెయ్యా, రండెయ్యా.'
'అన్నయ్యా, ఉద్దీలు పట్టించు,
నేను యేర్చుకొనెద నన్నయ్యా.'
ఉద్దీలను పట్టించె
పోలికె రాముడు యేర్చుకొనె
ఆవల యీవల చీలిక
ఆ నడుమ అడు గీచిరి. తం॥

మా. 'అన్నయ్యా, ఈ సంవత్సరం మీారు గెలచిన సరె, మేము గెల్చిన సరె,

మేలు మేలు!

యీయేటికి యెవరికి అక్కర లేదు. రెండవయేడు మేము ఓడినాము అనుకొనవలసినది.' 'మంచిది' అంటె 'మంచిది' అనుకొని ఆవల యీవల నిల్చిరి.

జట్ట్రీవట్టే లాడిరి.
పోలికె రాముడు ఓడెను
కుమార రాముడు గెలిచెను.

మా. కుమారరామయ్య వైపున ఉండే యుద్ది బ్రాహ్మణవారి చిన్నవాడు అన్నాడు గదా.

'పోలిక రాముడ! ఓడితివి'.
'ఇందాక జెప్పితినే, తం॥
న్ని నెవ్వ రడుగ మన్నారు?'
'ఏమైతేమే మోడితివోయ్.'
'నేను చాల ఓడితినా?'
బ్రాహ్మణవారి బాలుని
ఒక్క గుద్దు గుద్దెను.
గుద్దుకు చచ్చెను బ్రాహ్మణుడు.
కోమటి వారి బాలుడు
'ఎందరినని చంపెదవు?' తం॥
ఎదురు మరలి వచ్చెను.
వానిని చెంపకాయ వేసెకదా
వాడు గిరగిర తిరిగి చచ్చెగదా.
'అన్నయ్యా వచ్చెదవా?' తం॥

మా. అన్నదమ్ములు యిద్దరు గువ్వచవ్వ మనకుండా కోటలో జొరబడినారు. తతిమ్మా పిల్లలు పోయి వారివారి యిండ్లకాడ చెప్పవరకు, ఆ మాటలు వినగానె ఆచిన్నవారి తల్లిదండ్రాదులు మేలు మేలు! గోడుగోడు మనుచు దుఃఖపడుచు చచ్చిన పిల్లల భుజముపై వేసికొని కోటగాని లోనికి వచ్చి శవములను దింపి ఏకశ్లోకము పెట్టుచున్నారు. 'ఇదేమి', అని అడగగానె, 'రాజుకొమారులు కుమార రామయ్య, పోలికె రాముడు మా బజారుకు ఆడుకొనవచ్చి మా చిన్నవారిని ఇద్దరిని చంపినారు. మే మెట్లు భరింతము? రాజు ఇంతప్పటినుంచి రాజరికం చేయుచుండగ ఎన్నడును మేలు మేలు! యీలాగంటి సంగతులు యీ పట్నములో నెఱుగము,' అని గోల యెత్తుచునుండగానె, యీ రద్ది రాజుగారు విని

'మీరాసాహెబు, మన కోటగానిలో యేమో గల్లత్తు అవుచున్నది?'

'ఏమి మహాప్రభో, మన కుమార రామయ్య మేలు మేలు! పోలికె రాముడుకూడ వెళ్లి పిల్లలతో కలసి ఆడుకొనుచు బ్రాహ్మణవారి పిల్లవాని ఒకని, కోమటివారి పిల్లవాని ఒకని జంపి వచ్చినారట! వారి తల్లిదండ్రాదులు ఆ చచ్చిన శవాలను యెత్తుకవచ్చి మన కోటగానిలో బడవేసినారు.'

అనగానె రాజు,

'వీరు పుట్టడమేమి, నాపట్నమునకు అవ్వాడే రద్ది మేలు మేలు! రావడమేమి? నా రాజరికానికి యేమి పరువుదక్క గలదు? ఈ ఫిర్యాదు యేలాగున సముజాయింతును?'

అని ఆభోజీపంతులను పిలుపించి

'అది యేలాగంటె సంగతో విచారించి, అవ్వలకు ఎంతనుము' అనెను. అప్పుడా ప్రధానివచ్చి, మేలు మేలు !

'ఏమయ్యా, యీ రద్ది ?'

'అయ్యా ! మా బిడ్డలను రాజుగారి కొమాళ్లు చంపినారు. ఇక నేము కూడ బ్రదుకము.'

అని అనగానె

'మీరు యేడిచిన నేమివచ్చును? పోయిన చిన్నవాండు మరల వచ్చెదరా? మాతో చెప్పిన నేమగును ? మేలు మేలు !
వారికి ఆయువే ఉన్నట్టు అయితె బ్రదుకనె బ్రదుకుదురు. వారి ఆయువుబలము అంతె ఉన్నది ; కాని నిందస్తుతి మాత్రము వీరికి నచ్చినది. మీకు అదృష్టము తక్కువ, అని వారిని సముజాయించి వందరూపాయలు ఇప్పించి వారిని సాగనంపించెను. ఆవర్తమానము రాజుగారితో చెప్పెను. మేలు మేలు !
రాజుగారు కుమారరాముని పిల్పించి,

'కుమార రాముడ !'
'ఏమేమి, ఓనాయన!'
'బ్రాహ్మణవారి బాలుని,
కోమటివారి కుఱ్ఱవాని
ఆడుకొన బోయి చంపితివా ?'
'నేనుయెఱుగనె, ఓ బాబు !
నే నెంత మాత్రము యెఱుగను.' తం॥
'ఓరి ! పోలిక రాముడ !'
'ఏమే ఓ బాబయ్యా!'
'ఆడుకొనబోయి రాముడ!'
'పిల్లల నిద్దరిఁ జంపితివా ?'
'నే నంతటి పాపకర్ముడనా ?
నే నెరుగనె ఓ బాబు.'
ఒకళ్లు నొకళ్లు గుద్దుకొని
నామీద చెప్పిరి.
'రేపటి మట్టి మీరేమి
కోట బైటికి పోయినను
స్తంభానికి గిట్టించి
కంచీలతో గొట్టింతు.'
'ఇక బోనే బాబయ్యా!'
ఆ వేళ మర్నాడు తం॥
అల్లే కోటలో నున్నారు;
మూడవనాడు లెగిసిరి,
'అన్నయ్యా వచ్చెదవా ?'
'ఎక్కడికిర రాముడ ?'
'వీధికి బోతే రద్దాను
మన పూవులతోటలో నాడుకొని
మరలి యింటికి వచ్చెద మన్నయ్యా.'
'మంచి' దంటు లెగిసిరి.
ఊరుబయలున ఉన్నట్టి
పూవులతోటకె వచ్చిరి.
పూజారివారి పిల్లలు తం॥

స్వామివారి పూజకు
చెళ్లెక్కి పిల్లలు
పువ్వులు గోయుచు నున్నారు.
'ఎవరోయి! పిల్లలు!'
'మేము పూజార్ల మా రామయ్యా.'
'మా తండ్రి యెఱుకలేనిది
పువ్వులు యెట్లా కోయుదురు?'
'మాకు రోజురోజు సెలవేమి?
దక్కోలుగ స్వామికి
యీ వన మిచ్చె మహారాజు.'
'దిగిరండోయి చెప్పెదను.'

'దొంగలమా రామన్న?'
'దొంగలా దొరలా దిగిరండి.'
చెట్టు దిగిరి పిల్లలు.
ఇద్దరిని చేబట్టి
పోలిక రాముడు
త్రిప్పి చెట్టుకువేసి కొట్టెను.
ఒక్క దెబ్బకె చచ్చిరి,
వట్టెవాగులో బెట్టిరి
మన్ను పోసి బిగద్రొక్కిరి
తిరిగి కోటకు వచ్చిరి.

మా. ఆ చిన్నవాండ్ల తలిదండ్రాదులు జాముప్రొద్దు ఎక్కినకాని సాయంకాలమువఱకు చూచిరి, ఎక్కడను జాడలేక పోయిరి. మేలు మలు: పట్ణమంతయు ఇల్లిల్లూ వెదకి, 'చూచినారా, మా చిన్నవాండ్లను?'

అని అడుగగా

'మేము యెవ్వరము యెఱుగము' అని చెప్పగానె, అక్కడనుంచి బావులన్నియు వెదకిరి. వనములన్నియు వెదకుచుండగా ఊర పసుల దోలుకొని పిల్లలు పట్ణములోనికి వచ్చుచున్నారు. వీరు మహాదుఃఖపడి వనములు అన్నియు వెతకుచునుండగ పసులకాడి పిల్లలు జూచి 'ఏమిటమ్మా, తోటలన్ని వెదకులాడుచు నున్నారు?' 'నాయనా! మాచిన్నవాండ్లు స్వామివారికి పువ్వుల కోసము యీతోటలోనికి వచ్చినారు. మరలి ప్రొద్దుటిమట్టివారి జాడ లేదయ్యా, అందుచేత వెదకుచున్నాము.'

అనగానె,

అందులో ఒక చిన్నవాడు ఏమన్నాడనగా,

'మీ చిన్నవాండ్లు అని నే నెఱుగ; గాని ప్రొద్దున నేను పశువుల దోలుకొని పోవుచునుండగా చెట్టు మీద యిద్దరు పిల్లలు ఉన్నారు. కుమారరాముడు పోలికె రాముడు యిద్దరును ఉన్నారు. పోలికెరాముడు ఆ యిద్దరి పిల్లలను చంపి,

వట్టె వాగులో బెట్టెను'
వారు, 'అంభో' యని అడలుచును

వారు వట్టెవాగె వెదకిరి.
పిల్లల బాతిపెట్టి ఉన్నారు.

'అయ్యో! నాయన, యేమిసేతు?'
అొమ్మొఅొమ్మొ గుద్దుకొని
ఇద్దరిని పెళ్లగించి
భుజమున వేసికొని వచ్చిరి
దరవాజకాడ దింపిరి
గోలలు యెత్త సాగిరి.

మా. 'ఏమని' అందఱు అడుగుచునుండగానె, మేలు మేలు!

'నాయనా! కుమార రామయ్య, పోలిక రామయ్య యీ యిద్దరును, మా చిన్నవాండ్లు యిద్దరును పూవులు గోయుచు నుండగా మా చిన్నవాండ్లను యిద్దరిని చెట్టుకు వేసికొట్టి వత్తైవాగులో బూడిచిపెట్టి వచ్చినారు. ఇక మేము బ్రతుకము నాయనా, ఉరిపెట్టుకొని చచ్చేదము.'
అని బావులకు పరుగెత్తుక పోవుదురు. ఈ రద్ది రాజుగారు విని,

'ఏమోయి! మీరాసాహెబు, మన కోటగవనిలో రద్దేమి?'

'మహాప్రభో, మన పోలికె రాముడు కుమార రాముడు పూజారివారి పిల్లలను యిద్దరిని చంపి వత్తైవాగులో బూడిచిపెట్టి వచ్చినారట. మేలు మేలు! ఆ పిల్లలనిద్దరిని తెచ్చి మన కోటగవనిలో బడవేసి ఉరులు పెట్టుక చచ్చేదమని, వారి తల్లిదండ్రాదులు మొరలు పెట్టుచున్నారు.'

'ఇదేమోయి, నేను రాజరికం చేసే రాజునని ఒకతప్పుకు బకపాయించె దరు. పొడుగున యిద్దరిని ముగ్గురిని చంపుచుంటె వాండ్లు యెట్లు ఓర్చేరు? ఎవరి పిల్ల వారికె ముద్దు. నాకు సంతానం లేకపోయిన దుఃఖం లేదు. తాలూకా పట్ణమంతయు రద్ది ఆయెను. ఈ తగవు నేను తీర్చలేను,' మేలు మేలు!
అని రాజు విచార పడుచు కూర్చున్నాడు.

ప్రధాని అభోజిపంతులు సరదార్లు ముగ్గురు వచ్చి ఈ పూజారివారలు బహుమంచివాండ్లు.

'ఏమయ్యా, శవమును తెచ్చి యిక్కడ వేసినారు?'

'అయ్యా, కుమార రామయ్య పోలికెరాముడు మా చిన్నవారిని యిద్ద రిని చంపినా'రని

చెప్పగానె, మేలు మేలు!

'చంపగానె చూచినవారు యెవరు? వీరిని వారె కొట్టినారొ? వారిని వీరె కొట్టినారొ? వారికి ఆయువుండగా బ్రతికినారు. వీరికి ఆయువు లేకుండ చచ్చినారు. ఈ వర్తమానం రాజుగారు విని తన కుమారులను చంపవలెనని

దీక్షచేత కూర్చున్నారు. ఆ హత్యకూడ మీా కెందుకు? మీా చిన్నవాండ్లు పోయినవాండ్లు మళ్లీ మచ్చెదరా? ఏడ్చినందున సార్థకం యేమి ఉన్నది?'

అని వారిని సముజాయించి పంపించిరి. ఆ వర్తమానమురాజుగారితో చెప్పిరి. మేలు మేలు!

అప్పుడు కుమారరాముని పిలిచెను.
'ఓరి! కుమార రాముడ!
పూజారివారి పిల్లలను
నీ వెందుకు చంపితివి?' తం॥
'నే నెఱుగనె ఓ బాబు.'
పోలికె రాముని పిలిచెగద.
వాడు దుఃఖపడుచు వచ్చెను
'ఓరి! పోలిక రాముడ!
పూజారివారి పిల్లలను
నీ వెందుకు చంపితివి?' తం॥
'నే నెఱుగనె, ఓ బాబూ!
నే నంతటి పాపకర్ముడనా?'
'ఎందుకు దుఃఖ పడకురా.'
'నా కెక్కడి నిందలు వచ్చును
నే నెఱుగనె ఓబాబు'
'మంచిది పొ'మ్మనిపంపెను.
'మిమ్ము బందోబస్తు చేసెదను'.
ప్రధానిని పిలుపించి

మా. 'ఏమయ్యా, చిన్నవాండ్లు కోటలోనుండిన యీా పట్టణమంతయు గాడుపోవును. చిన్నవాండ్లను ఖైదులో వేయుదమనిన మనకు నిందగ నుండును.

'మహాప్రభో, ఖైదెందుకు గనుక? నాగంభొట్లు బ్రాహ్మణుడు బహు దిట్టమైనవాడు. ఆ బ్రాహ్మణునికి అప్పగింత బెట్టి మేలు మేలు! పట్ణానికి పన్నెండామడ పొడుగున అరణ్యములో చదువుల బడి కట్టించి అక్కడికి మోయుమతి సరంజాము బ్రాహ్మణునికి పంపించి మేలు మేలు! యెనిమిది సంవత్సర ములదాక పట్టణములోనికి రాకుండ చిన్నవాండ్లను బందో బస్తు చేయింతము'

అనగానె, రాజుగారు సంతోషించి చదువు చెప్పె నాగంభొట్లను పిలిపించి,

'బ్రాహ్మణుడా, నీ దగ్గర యెన్ని సంవత్సరములు చెప్పు చదువుఉన్నది?'

'మహాప్రభో, చదువుకు సాముకు అంతమున్నదా? పన్నెండు సంవత్సర ములు దాక చెప్పు చదువు నాదగ్గర ఉన్నది'.

'అంతే చాలును. మా చిన్నవాండ్ల నిద్దరికిని దిట్టముగ చెప్పి యెనిమిది సంవత్సరములు వెళ్లిన తరువాత తీసుక వచ్చి నాకు ఒప్పగింత పెట్టండి.'

'బడి యెక్కడ పెట్టుమని సెలవు యిచ్చెదరండి?' మేలు మేలు!

‘బడి పట్టణములో కూడదు. ఇక్కడికి పన్నెండామడ పోవుగున అరణ్యములో చదువుల బడి కట్టించెదను. బియ్యపు గోనెలు, కట్టెకూర వగైరా సామాను అక్కడికి పంపుచుందును. చిన్నవాండ్లను తీసుకవెళ్లు’మనెను.

చిన్నవాండ్లను యిద్దరిని వెంటబెట్టుకొని బ్రాహ్మణులు మోయమతి సరంజాము యెడ్లమీద కట్టించుకొని కంసాల బత్తులను వెంబడి పెట్టుకొని అరణ్యమునకు వెళ్లి ౧౫ రోజులకు చదువుల బడి కట్టించుకొని మంచివారముగ విచారించి చిన్నవాండ్లకు యిద్దరికి స్నానముచేయించి విఘ్నేశ్వరుని పూజ చేయించి,

మేలు మేలు!

ఓనమలు వ్రాసెను.
‘కుమార రామయ్యా! తం॥
ఓనమలు దిద్దండి,
కుమార రాముడు దిద్దె గద;
పోలికె రాముడు చూచెను;
‘ఇటువంటి చదువేన
మాకు జెప్పబోవునది’?
‘ఓరి! పోలిక రాముడ,
చదువుకు మొదలు ఇదేను,
ఓ న మ లు దిద్దర’.
‘వచ్చినవి పంతులు
క్రొత్తది ఒక్కటి చెప్పండి’. తం॥
అ ఆలు వ్రాసెను.
ఉగ్గడించి వేసిరి;
క ఖలు వ్రాసెను,
ఉగ్గడించి వేసిరి;
త థలు వ్రాసెను,
ఆకళింపు జేసిరి;
య ర వలు వ్రాసెను,
ఉగ్గడించి వేసిరి;
మూడు ఘడియలకు బాలులు
క ఖల గుణింతం తం॥

గుణకారం భాగారం
ఉగ్గడించి వేసిరి;
నాలుగవ ఒక్క గడియకు
బాలరామాయణము చదివిరి;
అయిదవ గడియకు బాలులు తం॥
అమరమంతయు జదివిరి;
ఆఱవ గడియకు బాలులు తం॥
గజేంద్రమోక్షము చదివిరి;
ఏడవ గడియకు బాలులు
రుక్మిణీ కల్యాణము జదివిరి;
ఎనిమిదవ గడియకు బాలులు
భారతము చదివిరి; తం॥
*పదునొకండవ గడియకు
కావ్యము జదివిరి
భరతశాస్త్రము చదివిరి;
పన్నెండవ గడియకు
వేదపనసలే చదివిరి;
పదమూడవ గడియను
‘ఏమయ్యా! పంతులు,
క్రొత్తది ఒక్కటి చెప్పండి’.
‘ఇక నాకు రా’ దనెను.

* తొమ్మిది పదిగడియల ప్రస్తావము లేదు.

మా. 'ఏమయ్యా బ్రాహ్మణుడా, మా తండ్రిగారితోటి చదువుకును నాముకును ఆది అంతము ఉన్నదా? నాయొద్ద మేలు మేలు! పన్నెండు సంవత్సరములు చదువు చదువు ఉన్న దంటివి. పన్నెండు గడియలకే ఇక నాకు రాదనుచున్నావు'.

'ఏమయ్యా! మీరు విద్యాదానము చెసికొన్నారు గనుక, శ్రీరాముల వారి వరప్రసాదము గాబట్టి లోకులకు పన్నెండు సంవత్సరములకు వచ్చు విద్య మీకు పన్నెండు గడియలకే వచ్చినది. వచ్చు టంతయు మీకే నయం కాదటయ్యా'?

'అయితే, నీకు నష్టమా బ్రాహ్మణుడా?'

'నాకు నష్టమేనయ్యా. మీ మూలకముగా పది పన్నెండు సంవత్సర సంవత్సరములు జీవించవచ్చును, మేలు మేలు! ఇకఁ డనుంచి వెళ్లి మళ్లీ యేరాజునైన అనుసరపక్షము చెయ్యావలెను.'

'బ్రాహ్మణుడా, మమ్మునుంచి నీవు యెందుకు చెడిపోయెదవు? చదివి నదే మేము చదువుచు ఆరునెలలదాక ఉందుము,'

అని బ్రాహ్మణునితో చెప్పగా బ్రాహ్మణుడు సంతోషించెను. బ్రాహ్మ ణుడు యేమి చేసెననగా, 'నేను గనుక స్నానమునకు వెళ్ళితినా దిద్దుపెట్టి వీరు పట్టములోనికి వెళ్లుదురేమో?'అని బ్రాహ్మణుడు ప్రొద్దుగ్రుంకుపరియంతం భోజ నముచేయక అట్లె ఉండెను. వీరు ముమ్మాటు భోజనముచేసి ప్రొద్దుగ్రుంకిన తరు వాత మళ్ళీ భోజనముచేసి అన్నదమ్ములు ఇద్దరూ ముసుగు మేలు మేలు! పెట్టుకొని పండుకొనిన తరువాత అప్పుడు బ్రాహ్మణుడు స్నానముచేసి వచ్చి భోజనముచేయును. అట్లే ప్రతిదినము జరుపుచు ఉన్నాడు. ఒకనాటి మధ్యమం దున కుమారరాముడు పోలికరాముడు ఇద్దరిని పండుకొననిచ్చి పాతాళగంగకు బ్రాహ్మణుడు స్నానమునకు వెళ్ళినాడు.

పోలికరాముడు లేచెను
చదువుల బడికి వచ్చెను.
అక్కడ నున్నది మడిసంచి
మరచి పోయినాడు బ్రాహ్మణుడు.
అది గురివింద పొదలో దాచిపెట్టి
అన్నదగ్గర పడుకొనెను.
నిండు ముసుగు బెట్టెను
దొంగగురక పెట్టెను.
స్నానముచేసి బ్రాహ్మణుడు
మడిసంచిని చూచుకొనె
మడిసంచి లేదయ్యా.
'నేను మడిసంచీ మరచితిని
అజాగ్రత్త పడితిని.'
చదువుల బడికి తిరిగివచ్చె.

ఎక్కడ చూచిన లేదుగా !
'ఎక్కడ బోతివె మడిసంచి ?
ఏ వేడ బోతివె పుస్తకమా ?
ఏ వేడ బోతివె జపమాలా ?'
ఎక్కడ వెతకిన లేదాయె. తం॥
'కుమార రామయ్యా !'
'ఏమయ్యా ! పంతులు'?
'నా మడిసంచిని చూచితివా ?'
'నేను ఎఱుగను పంతులు'
'విద్య చెప్పెడు గురు వేమి
మడిసంచిని దాచెదనా ? తం॥
దాచితె మీకు ఇవ్వనా ?'
'నా జీవనమే పోయెను.'
'మా పోలికె రాముని అడుగండి.'
'నీవే అడుగు రామయ్యా
'ఓరి ! పోలికె రాముడ'
'ఏమే ! ఓ అన్నయ్యా, తం॥
'చదువు చెప్పు పంతులది
మడి సంచిని దాచితివా ?'
'అంతటి పాపకర్ముడనా
విద్య చెప్పెడు గురువేమి
మడి సంచిని దాచెదనా ?'

మా. 'పోలికె రాముడ, నీవు ఎఱుగక పోతివి, నేను ఎఱుగక పోతిని. ఇక్కడి సొమ్ము యేమై పోయినదిరా ? ఇతరులు యెవరైన వున్నారు గనుక పట్టుకపోయినా రనుకొందమా ?'

అనగానె బ్రాహ్మణుడు అనెను గదా. మేలు మేలు ! 'కుమార రామయ్యా, ఇది పోలికరామయ్య పనే'. ఆమాట పోలికెరాముడు విన్నంతటనె,

బ్రాహ్మడివంకను జూచెను
పండ్లు పటపట గొరికెను
గుడ్లు యెర్ర జేసెను
'దొంగతనము కట్టితివా,
నేను దొంగనా పంతులు ?'

మా. 'పోలికె రాముడా, నీకు దొంగతనము కట్టలేదు. ఒకవేళ తీసినా వేమో అని అన్నాను'.

'నే నెంతమాత్రము యెఱుగను.'
'ఓరీ ! పోలిక రాముడా,
మన తండ్రితో జెప్పను
తీసిన యివ్వర రాముడ.' తం॥
'నె నెంతమాత్రము యెఱుగనె.'

మా. బ్రాహ్మణుడు యేమనుచున్నాడు.

'కుమార రామయ్యా, నేను పాతాళగంగలో స్నానముచేసి ఆ మడి సంచిలో విభూతి ధరించుకొని జపమాలికె నేత్రముల నద్దుకొని పుస్తకము చూచుకొనినెగాని గంగదాహం పుచ్చుకొనుట లేదు, నా గాయత్రి సాక్షిగాను.

'బ్రాహ్మణుఁడా, పుస్తకములో ఏమిఉన్నది?'

'అయ్యా, అది విప్పిచూచిన మూడామడ ముచ్చట, యేడామడ యే కాంతం కూడ తెలియును.'

మేలు మేలు!

'కావుననె, ఆశపడినాడయ్యా, పోలికె రాముడు. వాడు చచ్చినను ఇక దానిని యివ్వడు'

బ్రాహ్మణుడు,

'నా మడిసంచి దొరకిన దాక నేను భోజనము చెయ్య'నని దీక్ష పట్టుకొని కూర్చునెను.

పోలిక రాముడు యేమనుచున్నాడు.

'బ్రాహ్మణుడా, ఎన్ని దినములు అట్లా ఉండెదవో ఉండు'.

'పోలిక రాముడా, దాసీపుత్రుడవు అయినందున, నీ దుర్గుణపు మాటలు విడువవైతివి. నేను చచ్చినను నీవు చూచుచునుండువాడవె. మిమ్ము తీసుకపోయి మీ తండ్రిగారికి ఒప్పగింతపెట్టి నేను వెళ్లెదను పద' అన్నాడు.

'మంచి' దంటు లెగిసిరి
ముగ్గురు కూడుక వచ్చిరి తం॥
వసవల్లి దుర్గముకు
రాజుగారి కొలువుకు.
బ్రాహ్మణుని చూచెను మహారాజు
'ఏమయ్యా! బ్రాహ్మణుడ,
ఎనిమిది యేండ్లకు రమ్మంటె
అప్పుడె తీసుక వచ్చితివి?'
'అయ్యా, మడిసంచి పోయినది
నా జపమాలికయు బోయినది
కుమార రాముని అడిగితిని
పోలికె రాముని అడిగితిని
మేము యెఱుగ మన్నారు తం॥
ఆ మడిసంచిలో విభూతి

మా. 'నేను మడిసంచిలోని విభూతిని తీసుకొని స్నానముచేసి ధరించుకొని జపమాలికె నేత్రాలకు అద్దుకొని పుస్తకము జూచినగాని భోజనము చేయుట లేదు. రెండురోజులు చూచినాను, ఎంత మాత్రము ఇవ్వక పోయినారు. ఈ మట్టుదాక నేను భోజనము చేయకనే యున్నాను. నేను మళ్లీ ద్వీపాంతరములకు వెళ్లి పర్వతములందున ఉండే మునీశ్వరులనుచూచి మంత్రోపదేశమై యీ జప మాలికె పుస్తకము సంపాదన చేసికొనినగాని అందాక భోజనము చేయను. మీ కుమాళ్లను మీకు ఒప్పగింత పెట్టినాను. నా జీతమునాకు ఇప్పించండి, నేను వెళుతాను.'

అనగానె బ్రాహ్మణుని జీతము లెక్క చూచి ఇప్పించి సాగ నంపించెను.

కుమార రాముని పిలిచెను తం।
'ఓరి ! కుమార రాముడా,'
'ఏమే! ఓ నాయనా,
'చదువు చెప్పు బ్రాహ్మనిది
పుస్తకమును చూచితివా ?'
'నేను యెఱుగ' నన్నాడు.
'ఓరి! పోలిక రాముడ!'
'నీకు చదువుచెప్పె బ్రాహ్మనిది
మడిసంచి తీసితివా ?'
నాకు యెందుకే బాబయ్యా,
నేనంతటి పాపకర్ముడనా
నాకు యెక్కడి నిందలు వచ్చేను
ఎంతమాత్రము యెఱుగను.' తం॥
ఎఱుగక పోయిన పొమ్మనెను.
తల్లి మేడకు వచ్చిరి
అన్నదమ్ములు భుజియించి తం॥
'అన్నయ్యా! వచ్చెదవా?'
'ఎక్కడకు రాముడా ?'
'పెద్దబజారుకు పోదాము.'
'మంచి' దనుచు వచ్చిరి.

పెద్దబజారు నడుమను
కోమటివారి పిల్లలు
శూద్రవారి పిల్లలు
నాలుగు స్తంభా లాటలు
వారు ఆడుచున్నారు.
'అబ్బే! మేము ఆడుదుమా ?'
'మనుషుల జంపేవు రాముడా.' తం॥
'నేను చూపను రండోయి.'
వారిద్దరు వీరిద్దరు
నాలుగు స్తంభాలు గీచిరి
నాలుగు మూలల నలుగురు
స్తంభాలనడుమ నిలిచిరి
'బలము జెప్పుము తమ్ముడా'.
పోలికె రాముడు చెప్పెను,
చుట్టు తిరిగి రామునికి
తన మీదికె వచ్చినది.
పోలికె రాముడు తిరుగవలె,
నడుమ పోలికె రాముడు తిరిగె గదా
ఎంత మాత్రము దొరకరు
గడియసేపు తిరిగెగదా.

మా. కోమటివారి పిల్లవాడు తూరుపువైపు స్తంభములోనుంచి పడమటివైపు స్తంభములోనికి దుమికి పోవునప్పటికి

నడుమ ఒక్క గుద్దు గుద్దెను, తం॥
'గుద్దుకు వాడు చచ్చె గదా.
శూద్రవారి బాలుడు
ఎదురు మళ్ళి వచ్చెను
'నీవు రాజుకొడుకు వైనను

మనుసుల జంప మన్నారా ?'
వాని చెంపకురికి పుచ్చుకొనె;
ఆ దెబ్బకె వాడు చచ్చెను.
మొదలకుండ వచ్చిరి
కోటలోపల జొర బడిరి. తం॥

మా. కొంత సేపటికి ఆ పిల్లకాయల తల్లులు విని గోడుగోడున దుఃఖ పడుచు 'మా సంతానమునకు నీళ్లు పోయుటకే రాజుకు సంతానముగలిగె గాబోలును' అని శవములను తీసుకవచ్చి కోటగవునిలో బడవేసి గోడుగోడున దుఃఖ పడుచు ఉండంగా పదిమందివచ్చి, 'ఏమే' మని అడుగుచుండగా,

'అయ్యా, మా చిన్నవాండ్లు ఒకరి వీధికి పోరు, ఒకరి యింటికి పోరు. మా వాకిటి ముందర ఆడుకొనుచుండగా యీ కుమారరాముడు మేలు మేలు! పోలికె రాముడు కూడా వచ్చి బిడిగల్లుగా ఇద్దరిని చంపినారయా. మేమెట్లు బదుకుదుము,'

అని దుఃఖపడుచుండంగా, ఈ రద్ది రాజుగారు విని,

ఏమోయి! మీరాసాహేబు, మనకోట గవనిలో రద్ది అవుతుంది.'

'మహాప్రభో, మళ్ళీ పట్టమునకు రద్ది వచ్చినది. అయ్యా, కుమార రాముడు, పోలికెరాముడు ఇద్దరు వెళ్లి యిద్దరు పిల్లకాయలను చంపివచ్చినారట.'

అనగానె రాజు ఖిన్నుడై

'అయిదుయేండ్లమట్టి *రద్ది లేకుండ ఉన్నది పట్టము. మళ్లీ పట్టానికి రద్ది వచ్చినది. ఈ పిల్లవాండ్లను హదవు చేయు ఉపాయము నాకు తోచలేదు.'

అని రాజు విచారించుచుండగానె, రాజుగారి ప్రధాని చక్కగ వచ్చి,

'ఏమి, మాకోట గవనిలో ఈ రద్దేమి? అల్లరిసేయ దలచుకున్నారా? వారు యేమూలనుగ చచ్చినను కుమారరాముడు, పోలికెరాముడు చంపినారని చెప్పుదురా? మీకు శక్తిఉండిన రాజుగారి మీద ఫిరియాదు చెయ్యండి.'

'మహాప్రభో, అంతకు అధికార్లమా మేము? అంత అధికారముండిన యింత లెక్క వచ్చియుందుమా? అన్నముపెట్టి ఆదరించు మేలు మేలు! ప్రభువు ఆయనేగాని ఇంక వేఱు ప్రభువు ఉన్నారా?'

'రాజుతో చెప్పినను యేమి లేదు. ఫిర్యాదు చేసినను యేమి లేదు పోయిన చిన్నవాండ్లు మళ్లీ వచ్చెదరా? ఆయువుండిన వారే బ్రతుకుదురు.'

అని వాండ్లను సముజాయించి వందరూపాయలిచ్చి పంపించెను. రాజు గారితో యీ సమాచారము జెప్పెను.

'ఇట్లాగంటి ఫిరియాదులు ఎన్ని అని సముజాయించెదవు? ఎన్ని అని విచారించను? చిన్నవాండ్లను యెట్లు బందోబస్తు చేయగలను? చదువుల బడిలో ఒప్పగింత పెట్టగా పంతులను దుద్దుపెట్టి పట్టములో జేరిరి.'

* చదువుల బడిలో కుమారరాముడు పోలికెరాముడు గడపిన కాలము కొన్ని నెలలు మాత్రమే; అయిదేండ్లు గద్ది లేకపోవుట యెట్లో.

'మహాప్రభో, యింకేమియు లేదు. ఈపట్టణములో జెట్టీలు కాపుర మున్నారు. ముప్పైమూగ్గురు జెట్టీలకు గనుక ఒప్పగింత మేలు మేలు! పెట్టితిమా నెలకొక ముప్పది వరహాలు పోయినను అట్టి పోవును. వాండ్లు ప్రొద్దంతయు సాదనాల గరిడీలో పడవేసి దండెములు తీయుచుచుందురు. లేచిన ఒకటి వంగిన ఒకటి పొడుచుచు నుంటారు. అట్లు వీరు వంగి రావలెను గాని యింకొక విధముగ వీరు వంగిరారు.'

'నాకును అంతే తోచినది. జెట్టీలం బిలిపించ' మనెను.

అనగానె, వీరమజెట్టి, పేరమజెట్టి, కోనమజెట్టి మేలు మేలు! యీ నలుగురిని,* ముప్పైయింటికి సరదార్లను రాజుగారి యెదుటికి పిలిపించెను.

'ఎవరోయి! మీరు జెట్టీలటోయి?'

'మహాప్రభో. అవును.'

'ఎన్నడును జెట్టీలు మాపట్టణములో ఉన్నారన్న సంగతి మాకు తెలియనే తెలియదోయ్.' మేలు మేలు!

'మహాప్రభో, కాపురము మాత్రము ఇక్కడనేగాని, దూరముగా పోయి పొట్టపోసికొనెదము.'

'ఎన్ని సంవత్సరములు చెప్పు సాము ఉన్నది మీదగ్గర?'

'అయ్యా, చదువుకును సాముకును ఆదీ అంతముఉన్నదా? పదిపన్నెండు సంవత్సరములు చెప్పు విద్య మాదగ్గర ఉన్నది.'

'ఈ మట్టుకు యెవరెవరికి మీరు సాము చెప్పినారు?'

'అయ్యా, ఓరుగంటి ప్రతాపరుద్రునికి సాము చెప్పినాము. సుల్తాను భూపతిసింగుకు సాము చెప్పినాము. ఎఱభూపతి రాజుకు చెప్పినాము. కారు మొడ్డెప కక్కనపురాజుకు సాము చెప్పినాము. మేలు మేలు! చెప్పిన జెప్పితిమి కాని మా సాము, మా లగువు, మా జారు, మా పట్టు, మా బిగువు, ఒకరికిని చిక్కలేదు.'

'అలాగైతే సరె' అని 'మాచిన్నవాండ్రు యిద్దరికి సాదన చెప్పు'డనెను.

'మహాప్రభో, గరిడి యెక్కడైనా కట్టించెదరా? కోటలోపలనె చెప్పు మనెదరా?'

'ఈ పట్టములో కూడనే కూడదు. ఇక్కడికి పన్నెండామడ పొడుగున

* నాలుగవ జెట్టి పేరుచెప్పలేదు.

చదువు చెప్పించడమునకు గరిడీ కట్టించినాము. ఈ చిన్నవాండ్లను అక్కడికి తీసుకవెళ్లి సాము చెప్పవలసినది.'

'అయ్యా, మాకు అరణ్యమందున అన్నమున్నీళ్లు యెట్లు అందును?'

'అక్కడ ఉండనే యున్నవి కాయకూరలు. కలుపు చమురు బియ్యపు గోనెలు యిక్కడనుంచి పంపుచుందుము.'

'అయ్యా సాదనమునకు, యింకను చాల వస్తువులు కావలెను.'

'అవి యిప్పుడే చెప్పండి, వెనుకైనను ముందైనను మేలు మేలు! పంపించుచుందుము'.

'జారుస్తంభమొకటి కావలెను
లోడీలు కావలెను
బాణాకర్రలు కావలెను
పలీ గద్దా కావలెను తం॥
బల్లెములు కావలెను
డాలు కత్తి కావలెను
బాకులు రెండు కావలెను.'
ఇవి యెడ్లమీద గట్టిరి.
తమ సరంజామ తీసికొని
పిల్లల నిద్దర దీసికొని
అరణ్యమునకు గదలిరి.
ముప్పై ముగ్గురు జెట్టీలు
ఆ చదువుల బడికి వచ్చిరి.
ఆ గరిడి బాగు చేసిరి తం॥
జారుస్తంభము పాతిరి.
'రండయ్యా! రామయ్యా,
మీ కీళ్లన్నియు నలగవలె
నరముల పట్టు వదలవలె
మీరు సాదన యేమి చేయుదురు? తం॥
మాకు ప్రతిష్ఠ యెట్లు వచ్చునో?
యేమోయి! చెప్పండి.
మీరు నూఱు దండెములు తీయుదురా?
సాదన దబ్బున వచ్చును.
'అంత తీసిన చాలునా?'
'రెండు వందల దండెములు
మీ రిద్దరును దీయుదురా?'
'అంత తీసిన చాలునా?'
మూడు వందలు తీయుదురా?'
'అంత తీసినచాలునా?'
'ఇక నెన్ని తీయగలరు?' తం॥
'ఐదు వందలు తీయుదుము
మూడు వందల గుంజిళ్లు
మేము లెక్కపెట్టి పెట్టేము'.
వారు ఆశ్చర్యపోయిరి
'మీ రంత మాత్రము దీసిన
సాము మీకు వచ్చును'.
అన్నా దమ్ములు లేచిరి
లాగులు ఇద్దరు దొడిగిరి
పైన కాశెకోకలు కట్టిరి తం॥
జోడుగ దండెములు దీసిరి
అయిదు వందల దండెములు తం॥
మూడు వందల గుంజిళ్లు
లెక్కపెట్టుచు తీసిరి.
'ఇంకను యేమోయి సాదనకు?'

'లోడీలు త్రిప్పవలె.'
లోడీలు త్రిప్పిరి
త్రిప్పి దూరముగ వేసిరి.
'ఇంకను యేమోయి సాదనకు ?'
'ఫలి గద్దా చెయ్యవలె.'
ఫలి గద్దా చేసిరి
చేసి దూరముగ వేసిరి.
'ఇంకను యేమోయి సాదనకు ?'
'బాకు పట్లు పట్టవలె.' తం॥
బాకు పట్లు పట్టిరి
బాకుల మీాద దిరిగిరి
చేతులు చేతులు పెనవేసి
చేతుల సాదన చేసిరి.
'ఇంకను యేమోయి సాదనకు ?'
'బల్లెపు పట్లు పట్టవలె.'
బల్లెపు లగువులు చెప్పిరి.
'ఇంకను యేమోయి సాదనకు ?'
డాలు కత్తి దీసిరి.
'డాలు సాదన జెయ్యండి.'
డాలు సాదన జేసిరి. తం॥
'జెట్టీ పట్లు పట్టండి.'
జెట్టీ పట్లు పట్టిరి. తం॥

జొమ్ములు జొమ్ములు గదియించి
జొమ్ముల సాదన జేసిరి;
కాళ్లు కాళ్లు పెనవేసి
కాలి సాదన నేర్చిరి;
'ఇంకను యేమోయి సాదనకు ?
'జారు స్తంభము ఎక్కవలె.'
తల్లక్రిందుగా వెళ్లిరి
తల్లక్రిందుగా జారిరి;
'ఇంకను యేమోయి సాదనకు ?'
'జారు బండ దూకులు, తం
జారు బండ మీాదికి
తొమ్మిది బారలు దూకవలె.
ఒక్కలగువు మీాద దూకిరి.
అన్నదమ్ములు ఇద్దరికి
పన్నెండేండ్ల సాదన
పన్నెండు గడియలకె వచ్చెను.
'ఏమోయి! జెట్టీలూ,
క్రొత్తది ఒకటి జెప్పండి'
'ఇకను మాకు రాదండి.' తం॥
'ఓరి! మీాముండ మోయను!
మా తండ్రిగారి దగ్గరను
మా బగిలినాటలు చెప్పితిరి.'

'నల్లురు జమీాదార్లకు సాదన చెప్పినాము. మా లగువు, మా బిగువు, మా జారు, మాజగ్గు, మాలైలు వచ్చినదా అనగా మేలు మేలు! రాలేదంటిరి. ఇదేనంటోయి మీారు చెప్పు సాదన.'

'అయ్యా! మీారు తొల్లి విద్యాదానం చేసుకున్నారు. శ్రీరాములవారి వరప్రసాదులు, గనుక పన్నెండు గడియలకె వచ్చినది. ఇది మీాకే నయముగాని మాకు నయము లేదయ్యా, కుమారరామయ్యా.'

'మాకు నయమేమి ? మీాకు నష్టమేమి ?'

'మీా మూలముగా ఎనిమిది సంవత్సరములు జీవింపవచ్చునని యను

ంన్నాము. మీకు పన్నెండు గడియలకే వచ్చినది, గనుక మేము తిరిగి యే రాజునైనను అనుసరణచేయవలెను'. మేలు మేలు !

'మావలన మీరెందుకు చెడిపోయెదరు ? ఈ నింద మాకెందుకు ? ఆరు నెలలు మేము యీ గరిడీలో నుంటాము.'

అనగానె జెట్టీలు మహా సంతోషించిరి. వీరు, చేసిన సామే మళ్లీ చేయుచునుండిరి. ఒకనాటి మధ్యాహ్నమందు కుమారరామయ్య, పోలికరాముడు యిద్దరు భోజనముచేసి రెండు జాములప్పుడు పరుండగా మేలు మేలు !

పోలికె రామునికి
ఆ గురివిందపొదలో మడిసంచి
జ్ఞాపకమునకు వచ్చెను.
దిగ్గున లేచెను
మడి సంచిని తీసెను,
విప్పి చూచెను రాముడు తం॥
జపమాలికె యున్నది,
పుస్తకమే యున్నది,
అందులో సభకట్టు వాకట్టు
గ్రహకట్టె యున్నది.
విప్పి చూచెను రాముడు
దక్షిణభాగమున కూర్చుండి
తన పట్టంమీదుగ చూచెను
పట్ణములోని భోగముల
యేకాంతము దెలిసెను.

మా. ఆట్ణములోని భోగముల యేకాంతం యేలాగంటిదంటె, తనతండ్రి వీరకుంభిణి మహారాజు కంపిలి గంగావతి యనియేటి మేలు మేలు ! పట్ణమునకు స్వారిమార్గము వెళ్లెను. ఆ పట్ణములో మద్దెల వీరసాని కూతురు మద్దెల మలసాని రాయమహల్ మీద నున్నది. కన్నెరికము లేదు. రాజుసవారీలోని తొలకరి మెఱుపుగా మెఱిసినది. రాజు మూర్ఛపోయిలేచి తన నౌకర్లను దగ్గరకు బిలిచి ఆరాయమహల్ యెవరిదో విచారించమని నౌకర్లతో చెప్పెను,

వారు పట్ణములోనికి వెళ్లి,
'ఈ రాయమహల్ యెవరిది ?' అని అడిగితె,
'మద్దెల వీరసానిది' అని చెప్పినారు.
'ఆ రాయమహల్ మీద నున్న చిన్నది వీరసానేనా ?' మేలు మేలు !
'అదికాదయా, దానికూతురు మలసాని. దానికి ఇంకను కన్నెరికము కాలే'దని చెప్పినారు. మేలు మేలు !
ఆ వృత్తాంతము రాజుకు తెలియజేసిరి.
అప్పుడు రాజుగారు యేమన్నారనగా,
'కన్నెరికమునకు మావసవల్లి దుర్గమునకు పంపించునేమో తెలిసికొని ర' మ్మన్నాడు. వారు పోయి ఆ మాట వీరసానిని అడిగితే,

'మహాప్రభో, అన్నముపెట్టు దాతలుంటే పంపించకపోవడమేమి ? పంపించెద' నన్నది.

'మా రాజుగారు వెళ్లుచున్నారు, ఇంకను ఆలస్య మేమి ? పంపించు' మనగానె శీఘ్రముగ సవారి బైటబెట్టించి మలసానిని సవారీలో నుంచుకొని రాజును, మలసానియు వసవల్లి దుర్గమువచ్చినారు. మేలు మేలు !
రాజుగారు పల్లకీ దిగినతోడనె బ్రాహ్మణులను బిలిపించి

'మా పేరట ముహూర్త బలము విచారించ' మనెను.
బ్రాహ్మణులు విచారించగా ఇరువై రోజులదాక ముహూర్తములేదు.

'మహాప్రభో, మీ పేరట యిరువైరోజులదాక ముహూర్తబలము లేదు' అనగానె తన రాయమహాల్ ఖాళీచేయించి ఆ రాయమహాల్ మీద యీ మలసానిని ఉంచి, అక్కడికి మగవారు యెవ్వరు పోకుండ ఖాయిదా చేయించి ముగ్గురు దాదులను దానియొద్ద కావలియుంచి మేలు మేలు !
బందోబస్తు చేయించెను.

ఈ వృత్తాంతము అక్కడ పోలికెరామునికి పుస్తకము ద్వార తెలిసినది.

అట్ట మడిసంచి కట్టెను
'నాకు జీవనమే దొరికెను.'
మంచి ఖుశాల్ పడినాడు తం॥
మలసాని మంచిదో
ఆలాగంట రాముడు.
మడి సంచి తీసికొని
అన్న దగ్గెరకు వచ్చెను.
కుమారరామయ్య
నిద్ర బోవుచునున్నాడు
ఆ మడిసంచి దాచెను
గరిడీలోనికి వచ్చెను
ముప్పైముగ్గురు జెట్టీలు
లేకి సరంబీ యున్నది తం॥
సరంబి మీద కూర్చున్నాడు
'రండోయి ! జెట్టీలు,
మీరు చెప్పిన సాదన
మీరు జెప్పిన లగువులు
మీరు ముప్పైముగ్గురు ఒకపట్టు
నే నొక్కడనె ఒకపట్టు
ఒక్కచేయి చూతాము.'
'విన్నావా రాముడా ?
నీ చిన్నతనము చాలించు
మాతో యేమి గెలువను ? తం॥
పుణ్యానికి చచ్చెదవు.'
'అట్లుగాదు రండోయి !
ఈకుంకలు అప్పుడే కొట్టెరి తం॥
ఈ రండలు గెలిచి పోయిరి
ఈ ముండలు అప్పుడె కొట్టెరి.'
నరసమజెట్టికి కోపము
కోపము బుట్టి లేచెను.
కుమారరాముని యొద్దకు
తీవరముగ వచ్చెను.
'కుమారరామయ్యా ;'
'ఏమోయి ! జెట్టీలు ?'

మా. "అయ్యా, మేము టేకుమ్రానుపై ముప్పైముగ్గురము కూర్చుని యుండగా పోలికెరాముడు చక్కగవచ్చి, మేలు మేలు!
'మీరు ముప్పైముగ్గురు ఒక పట్టు, నేను ఒక్కడనె యొకపట్టు. ఒక చేయి చూతము రమ్మ'న్నాడు. చిన్నవాడు అని మేము సముజాయించుకొని ఊరకుండగా 'ఈరండలు అప్పుడే నన్ను గెలిచినారు, ఈకుంకలు కొట్టినా'రంటాడయ్యా. విన్నారా?"

'ఓయి! జెట్టీలారా, పోలికెరాముడు దాసీపుత్రుడు; గనుక దుర్గుణపు మాటలు ఆడినాడు; వానిజోలికి పోక మీ పనిలో మీరు జాగ్రత్తగఉండండి.'

వీరు తిరిగివచ్చి టేకుమ్రాను మీద కూర్చున్నారు. మేలు మేలు!

మళ్లీ పోలికెరాముడు చూచెను
'ఏమోయి! జెట్టీలు,
రండోయి! సాదనకు.' తం॥
'నీతో మాకు యే'మనిరి.
'లేక కుంకలు మీరు కొట్టనా?
నాతో మీరు గెలువనా?
మీకు కోకలు దెచ్చి యిత్తునా?
రవికెలు దెచ్చి యిత్తునా?
ఆ కోకలు మీరు కట్టండి
రవికెలు మీరు తొడగండి
చేతికి గాజులు తొడగండి
కుంకుమబొట్లు పెట్టండి.' తం॥

ఈ మాటలు వినగానె
జెట్టీలు లెగిసిరి,
చెడ్డతామసము బుట్టె గద.
'రాజుగారు వినినను
మన తలలు గొట్టేని
ఇంకను ఏమి చేయను?
నడుములు గట్టండి'.
ముప్పైముగ్గురు లేచిరి
మట్టి లాగులు దొడగిరి
కాశె కోకలు బోసిరి
డాల్ కత్తులు దీసిరి. తం॥

మా. పోలికె రాముడు చూచి, 'విన్నారటోయి, జెట్టీలారా! మీ తల్లిదండ్రాదులు మీకు డాలు కత్తులు సంపాదన జేసి యిచ్చినారు. గనుక అవి మీరు తీసికొన్నారు. నాకు చేతిలోనికి యేమి ఆధారం లేదు. మేలు మేలు!
అయితే యేమాయెను? కాని నన్ను మరపించి రాబోకండి. నన్ను బొంకించి రాకండి. పక్కపెట్టుగ రావద్దు. ఏదీ ముప్పైముగ్గురు ఒక అడుగుమీదనె వచ్చెదరో? రెండు అడుగులమీద వచ్చెదరో? మూడడుగుల మీద వచ్చెదరో? రండి. మీ యొడలు కాచుకొండి. మేలు మేలు!

జాగ్రత్తగ రండ’నెను
‘ఓరీ! నీ వెంత రాముడా
మా చేతులోనికి ఉన్నావా?
దాసీ పుత్రుడవు గనుకను
నీకు దుర్గుణము పుట్టినది
నీ చావుకె పుట్టెగద
రారా! ఓరి రాముడా!’
రుమాల నడుమున గట్టెగద
ఇరువైనాలుగు మూరలది
దండ పగడ తీసెను తం॥
అది గడ్డముక్రింద పెట్టెను.
వీరు సాదన మీద వచ్చెదరు.
పోలికె రాముడు చూచెను;
‘అబ్బబ్బ! సాదన! తం॥
అబ్బబ్బ! లగువులు!
మిమ్ము చూచిన భయమురా!
మీ చిన్నవాండ్లను తలవండి’.
దగ్గరకు రానిచ్చి
వెదురు గడను ఎత్తెను
త్రిప్పి ఒక్కపెట్టు పెట్టెగద.
ముప్పైముగ్గురు జెట్టీలు
దెబ్బకు నేలను కఱచిరి
కొఱ్ఱుతో గాల్చినట్టిమి తం॥
ఒక్కదెబ్బయె ఉన్నది
ఆ దెబ్బకె అందరు చచ్చిరి.
కదిలించి చూచెను
ఒకనికిని ప్రాణము లేదాయె.
వెదురు గడను పడవేసి
వచ్చి అన్నదగ్గర పండుకునె
దొంగ గురకలు పెడుతాడు.
కుమారరామయ్య లేచెను
గరిడీలోనికి వచ్చెగద.
ముప్పైముగ్గురు పడియుండ, తం॥
‘ఏమిరోయి! జెట్టీలు,
అట్లె పండుక యున్నారు?’ తం॥
అనుచు దగ్గరకు వచ్చెను
అందఱు చచ్చి యున్నారు.
‘ఇది యేమి చోద్యము!

మా. ఇదియేమొ ముప్పైముగ్గురుకి కొఱ్ఱుతో కాల్చినట్టు ఒకటే దెబ్బ ఉన్నది. మా పోలికరాముని మహిమవలె యున్న’దని తిరిగి పోలికరాముని దగ్గరకు వచ్చెను. మేలు మేలు!

‘ఓరి! పోలిక రాముడా!’
దొంగ గురక పెడుతాడు
యెన్ని పిల్చినను పలుకడు.
ఏమి నిద్ర! లేవరా.’
‘ఏమే! ఓ అన్నయ్యా!’
‘ఏమిర జెట్టీలు చచ్చిరి?’
‘నేనంత పాపకర్ముడనా?
ఎంత మాత్రము ఎఱుగను’

మా. ‘నీవు ఎఱుగక పోతివిగదా? వాండ్లు చచ్చినారు.’

“అన్నా, నేను నీదగ్గర అప్పుడే పండుకొంటిని గదా, వాండ్లు ఒకళ్లకు ఒకళ్లు ‘ఛీ! బళా! ఛీ! బళా!’ అనుకొనుచుండిరి. వారిని వారే కొట్టుకొని చచ్చి యుండవలెను గాని నే నెంతమాత్రము ఎఱుగ”ననెను. మేలు మేలు!

అప్పుడు కుమారరామయ్యగారు పాతాళగంగ కడకు వచ్చి చెంబెడు ఉదకం తీసికొని ఇంత తులసిపత్రి కలిపి '(శ్రీ)రాములూ, నీవే కల'వని ఈముప్పై ముగ్గురికి తులసితీర్థం పోసినాడు. ముప్పైముగ్గురును దిగ్గున లేచి కూర్చున్నారు.

పోలికెరాముడు ఏమంటున్నాడు.

'అన్నయ్యా, ఈ ముండాకొడుకులు బహువడికాండ్లు, అనుకొని యొక చేయు చూతామా అని అనేవఱకు ముప్పైముగ్గురు డాలు కత్తులు తీసికొని నాపైకి దొమ్మరి గంతులు వేయుచు వచ్చినారు. వెదురుగడ తీసికొని ఒకపెట్టు పెట్టువఱకు ముప్పైముగ్గురు నేల కఱచుకున్నారు.'

'ఆరే! ఈవేళదాక నేను యెఱుగనన్నావు?'

'అన్నయ్యా, నీవు బ్రతికించు సంగతి నాకు తెలసినది కాదు. నీవు బ్రతికించియుండగ చెప్పితిని గాని లేకపోయిన నేను చెప్పుదునా? ఆరే! జెట్టీలారా, ఇట్లాగె దొమ్మరి గంతులు వేయుచు నామీదికి యింకొకసారి వచ్చితిరా మాలికొండ మర్త్యలోకం అంటద్రొక్కెదను. ఈ మాట జ్ఞాపకము ఉంచుకోండి,'

ఆవేళకు తెల్లవారెను. మరునాడు అన్నదమ్ములు యిద్దరు జాముప్రొద్దు యెక్కె భోజనముచేసి నిండుగముసుకుపెట్టి పండుకున్నారు. పోలికెరామునికి యీ మడిసంచి మళ్లీ జ్ఞాపకమునకువచ్చినది. అన్నను నిద్దుర పోనిచ్చి, మేలుమేలు!

దిగ్గున లేచెను రాముడు
ఆ మడిసంచి తీసికొని
డాలు బల్లెము తీసికొని తం॥
వసవల్లి దుర్గముకు
ఎవరితో జెప్పక రాముడు
ప్రొద్దు గ్రుంకె వఱకేమి
పట్టణదగ్గరికి వచ్చెను.
ఊరిపసులు తోడను
పసులకడ పిల్లలు
పశువుల తోలుక రాగను
ఎవరోయి! పిల్లలు,
పట్ణములోపలి వర్తమానం తం॥
నా కేమైనను జెప్పెదరా?'
'మాకేమి తెలియును?
మమ్ము అడుగ వచ్చెదవు.'
కత్తి దూసె రాముడు
'ముక్కు చెవులు గోయుదునా?'
ఆనవాలు పట్టిరి
'పోలికె రాముడే!' యనుచును
'ఎఱుగుదుము రామయ్యా'
'ఏమెఱుగుదురో చెప్పండి'.

మా. 'మా పట్టణపురాజు కంపిలి గంగావతి మేలు మేలు!
అనియేటి పట్ణం స్వారీమార్గం వెళ్లినాడట. ఆపట్ణములో మద్దెల వీరసాని కూతురు

మలసాని భోగమువారి చిన్నది ఉండగా మా రాజుగారు కన్నెరికము పెట్టుటకు తీసుక వచ్చినారట. లగ్నముహూర్తము విచారించగా ఇంకను యిరువై రోజులు ఉన్నదట. మేలు మేలు !

మా పెద్దవాండ్లు చెప్పుకొనిరి
అనుకొనగా విన్నాము'.
'మంచిది పొమ్మనెను.
'నే వచ్చితి ననుచు జెప్పితిరా
రేపు పసులకడ బట్టుకొని
అందరి ముక్కులు గోసెదను.'
పిల్లలంతా కూడుకొని
'మన యిండ్లకడ జెప్పవద్దు తం॥
చెప్పిన ముక్కులు గోయును'
అలాగనుచు వచ్చిరి.
పోలిక రాముడు

మా. ఊరి ముంగల మంచినీళ్ల బావి యుండంగా మంచినీళ్ల బావికడ బొమ్మజెముడు ఉండంగా ప్రొద్దు పోవుమట్టుకు ఆ బొమ్మజెముడులో గూర్చున్నాడు. ఆ పట్నమునకు ఊరుచుట్టు కోట. మూడుదరవాజాలు, పారాచౌకీలు, దిట్టముగా నున్నవి. ఊరు మాటు మణగనిచ్చి.

పోలికె రాముడు లేచెను
పెద్ద దరవాజకు వచ్చెను
సభకట్టు కట్టెను, తం॥
వాకట్టు గట్టెను,
సొక్కుపొడి చల్లెను,
ఆ దరవాజా దాటెను.
రెండవ దరవాజకు వచ్చెను
అక్కడ సభకట్టు కట్టెను
వాకట్టు కట్టెను
సొక్కు విభూతి చల్లెను
ఆ దరవాజా దాటెను.
మూడవ దరవాజకు వచ్చెను
సొక్కు విభూతి చల్లెను
మత్తు పొడి గొట్టెను తం॥
ఆ దరవాజా దాటెను.
పెద్ద బజారుకు వచ్చెను
నాలుగు వీధులు జూచెను.
'ఈవేళ ఎవరియిల్లు దోచుదును ?
ఎవరి యింటిలో నేముండును ?'

మా. దగ్గరనె యున్నది పోలిసెట్టి మళిగ. మళిగెతట్టు చూచి,

'నాకు జీవనమె దొరకెను
ఖజాన బిందెలు ఉన్నవి
ఆ మళిగెకు కన్న మేసెను.
కన్నముగుండ దూరెగద
మచ్చువంక జూచెను. తం॥
మచ్చుకు నిచ్చెన వేసెగద
దస్తు బిందెలు దింపెగద
ఖజాన బిందెలు దింపెగద
బట్టల పెట్టెల దీసెను
కన్నముగుండ గడిపెను

కొబ్బరికాయలు జూచెను
ఖర్జూరపండు జూచెను
మలసానికి కావలెను
ఖర్జూరపండు దాటించె
బియ్యాపు తట్టలు దీసెగద తం॥
పటిక బెల్లమె దోచెను
పంచదార దీసికొనె
రవికపెట్టెలె తీసికొనె
కన్నముగుండ దూరెను.
'నే నింకొక్కటి మరచితిని
మంగళసూత్రము కావద్దా
భోగముదానికి కావద్దా ?'
మళ్లీ కన్నముగుండ దూరెను.
గుగ్గిళ్ల పోలిసెట్టి
పోలిసెట్టి భారియ
అది గుగ్గిళ్లవారి రత్నమ్మ
సత్యమైన యిల్లాలు తం॥
నిద్రబోవు చున్నది.
ఆ మంచముకడకు వచ్చెగద
'నీ వున్నావంటే నాతల్లి
నీ విక్కడున్నావా నాయమ్మా'.
సభకట్టు కట్టెను
వాకట్టు కట్టెను
సొక్కువిభూతి జల్లెను
మెడలో చెయ్యి వేసెగద
గుండ్ల పేరులు ద్రెంచెను
గుండ్లపట్టెడ దీసెను తం॥
కుంకెనకుచ్చులు దీసెగద
పాంజేబులు దీసెను
బాజీబందులు దీసెను
రాగిణిబిళ్ల దీసెగదా

నట్టింట రుమాలు పఱచెను
రుమాల కొంగున గట్టెను
మలసానికి కావద్దా ?
ఆ మెట్టెలుకూడా తీసికొనె
కన్నముగుండ దూరెను. తం॥
'అయ్యో! యింకొక్కటి మరచితిని
మంగళసూత్రము మరచితిని'
మళ్లీ తిరిగి వచ్చెగద
దాని మెడలో చేయి ఉంచెను
'నీకు రెండున్న వటె నాతల్లి
రెండుమంగళ సూత్రాలు తం॥
నాకు ఒక్కటీ యిచ్చెదవా
నీ కోడలికి కావలెను'.
ఒక మంగళసూత్రము ద్రెంపెగద.
సత్యమైన యిల్లాలు
కన్ను లెత్తి చూచినది.
తన పెనిమిటియే యనుకొనెను.
'ఇది యేమి పాపము
ఇదియేమి చేటుకాలము
నా మంగళసూత్రము ద్రెంపెదవు'. తం॥
'ఊరుకో, ఊరుకో' యన్నాడు
వెనక్కు వెనక్కు జరిగెను
కన్నముగుండ దూరెను.
ఆబిడ దిగ్గున లేచినది
కన్నముతట్టు చూచినది
'దొంగలో !' యని అఱచినది.
ఇరుగున పొరుగున పలుకరు
ఎవరిని పిలిచిన లేవరు.
తన పెనిమిటి యున్న అఱలోకి
వచ్చెను వేగమె రత్నమ్మ తం॥
పెనిమిటి నేమని పిలిచెను

'ఏమంటె పలకవు
అదేమంటె పలకవు
యేమి నిద్ర! పలుకవు
ఆహా! యేమి పలకవు
దొంగలో! దొంగలు!
మూగా చెవుడా, పోలిసెట్టి?'
'ఊరుకో ఊరుకో పెండ్లికూతుర'.
'నీ తలపండు పగులను
సొమ్ము పోయి నే నుంటె
నన్ను పెండ్లికూతు రంటావా?
దొంగలో! దొంగలు!'
'కుయ్యకోసి వెట్టికోతి'. తం॥
'నీ ఆయుస్సు క్రుంగను
ఇంటికి కన్నము వేసిరి
సాపుగ దోచుక పోయిరి
మంగళ సూత్రము పోయినది
మన ఖజానబిందెలు పోయెగద.'
మాట సంజ్ఞను కన్నాడు
ఓమ్మో ఓమ్మో గుద్దుకొని,
'ఇక నేమి యున్నది
ఇక నేనెట్లు నిలువను
సర్వదుంబాలాగ దోచెను'. తం॥
తెల్లవారిన తరువాత
రాజుగారితో జెప్పెను
ఆలాగున పలికెగద. తం॥

మా. అప్పుడు పోలికె రాముడు లేచి యీ సరంజామంతా తన పచ్చడంలో మూట గట్టుకొని మద్దెల మలసాని మహల్ మీదికి వచ్చి,

'ఎవ్వరె నీవు మలసాని,
తలుపు తీయ' మన్నాడు.
పలుకకపోయె మలసాని.
'తలుపు దీయవే మలసాని
నీకు మేలిమి నగలు తెచ్చితిని'.
తన దాదులను పిలుచుకొని తం॥
'కావేరీ, కస్తూరీ,
ఎవరె తలుపు దీ యనియెదరు
గముకులు వేయుచునున్నాడు
వీరకుంభిణి మహారాజు
మహారాజు కాబోలు.

మా. వీరకుంభిణి మహారాజేమి ఈవేళప్పుడు వచ్చుటయేమి? ఇంకను యిరువై రోజులు ముహూర్త మున్నదె? వీరకుంభిణి మహారాజు కా'డని అనుచుండగానె

'ఆరె! పోలికె రాముని యెఱుగరా?
తలుపు దీ'య మన్నాడు.
తలుపట్టె తీసెను. తం॥
'వెయ్యి, పట్టెమంచము వేయవె'.
పట్టె మంచము వాల్చెను
నగలన్నిటి పోగుబోసెను. తం॥
'ఇవిగో మంచి నగలు తెచ్చితినె
ఈ ఖజాన బిందెలు తీసికో
ఇవిగోనె సూడిదలు
పంచదార యిచ్చెదను

టిక బెల్లము యిచ్చెదను
కులు పోకలు యిచ్చెదను
నము జేయవె మలసాని'.
నము అట్టె చేసెను
లుగు గడియలు ఉండెను;
క రవికె ధరియించెను తం॥
లుగు గడియలు పుచ్చెను;
రులట్టె దువ్వెను
లుగు గడియలు పుచ్చెను;
టుక కుంకుమ బెట్టెను
లుగు గడియలు పుచ్చెను;
న నగలన్ని ధరియించె
లుగు గడియలు పుచ్చెను.
ంటెవేళ జామాయె
క నాలుగు గడియల రాతిరి
తెల్లవారు వచ్చినది.
ఇదేమే! మలసాని తం॥
తెల్లంగ తెలవారు
నీకు యిన్ని నగలు యిచ్చితిని
ఖజాన బిందెలు యిచ్చితిని తం॥
చచ్చుదాక బ్రతుకవచ్చు
విశ్వాసమె లేదాయె.'
వచ్చెను మలసాని
ఘల్లు ఘల్లు మంటును.
ఒడిసి రెక్కను పట్టెను,
అది బన్నసరమును త్రెంపుకొనె
'షహబాసు! రామయ్యా!
భోగమువారి యిండ్లకు
యెన్నడైనను వచ్చితివా?
వచ్చితివా పోయితివా? తం॥
నా బన్నసరమును త్రెంపితివి
నా బన్న సరమే గ్రుచ్చవలె
నీ యొద్దకు నిద్రకు రావలెను'.
'నే గ్రుచ్చెదను రామ్మనెను.
సెమ్యాల యెదుటను
పోలికె రాముడు గ్రుచ్చెను
మలసానీ దూసెను
తెల్లంగా తెలవారె.
'ఇది యేమే మలసాని,
తెల్లవారె పోయెను
'భోగముదాని నమ్మరాదు
దీని బుద్ధి యెంతచేయును!
రేపు పెందలకడనె వచ్చెదనె తం॥
వచ్చువఱకు నీవేమి
ముస్తాదై యుండవలె తం॥
నీవు ఉండకపోయిన మలసాని
నీ ముక్కు చెవులు గోయుదును'.
అలాగంటు జెప్పెగద
తెల్లవారె వఱకేమి
మూడు దరవాజాలు దాటెను
ప్రొద్దు గ్రుంకె వఱకేమి
గరిడికి వచ్చిచేరెగద.
కుమారరాముడు చూచెను
'ఏడకు బోతివి రాముడ'? తం॥
'అడివికి వేటకు బోతిగద'.
'రాతిరి యెక్కడ నున్నావు?'
'అడవిలో ప్రొద్దు గ్రుంకినది
రాలేక యున్నాను
అడివిలో పండుకొన్నాను
నాకు చెడ్డ దిగులు పుట్టినది
నాకేమో గుబులు పుట్టెగద.'
'ఏమి దిగులు చెప్పరా'.

'అన్నయ్యా! విన్నావా?
మా తల్లి కలలో వచ్చినది
మా తల్లిని నేను చూడవలె తం॥
నాకు బుద్ధి పుట్టినది
నాకు పట్నముపోను సెలవీవె
తల్లిని చూచి వచ్చెదను.'
'ఓరి! రాముడా విన్నావా? తం॥
మన తండ్రి సెలవు లేదేమి
యెనిమిది యేండ్ల దాకను
వనవాసములో నుండవలె
పోయిన బ్రతుకక నివ్వడు.'
అన్న లేక నే బ్రతుకనా?
మా తల్లిని చూడక బ్రతుకనుగ.'
'మంచిది కానీ రాముడ,
అట్లాగె పోదువు
గరిడీ సాదన చెయ్యర.'

మా. గరడీలోకి సాదనకు వెళ్లినాడు పోలికె రాముడు. వెనుక వసవల్లి దుర్గములో పుట్టిన వృత్తాంతము: గుగ్గిళ్ల పోలిసెట్టి వచ్చి మేలు మేలు! రాజుతో ఫిర్యాదాయెను.

'మహాప్రభో! ఎక్కడనుంచి వచ్చెనో దొంగ? రాత్రి మాయింటిలో కన్నము వేసి సర్వదుంబాలాగా దోచుకపోయినాడు. మహాప్రభో! మీారు ఇంతప్పటినుంచి రాజ్యము చేయుచున్నారు గాని ఎన్నడును ఈ పట్నములో దొంగ యను వర్తమానము వినలేదు. ఊరంతయు నుండగా నాయిల్లే యేర్చుక వచ్చినాడు.

అందుకు రాజుగారు యేమన్నారనగా,

'ఊరిచుట్టు కోటయుండంగా, కోటకు మూడు మేలు మేలు! దరవాజాలు ఉండంగా, మూడు దర్వాజాలకడ పారాచౌకీలు ఉండంగా, పరాయి దొంగ ఈ కోటలోనికి ఎట్లు వచ్చినాడు? ఇది ఊరిలోని దొంగతనమే కాని ఇతరముకాదు. 'ఏనుగులకు వైరి యెనబోతుల యెట్టన్న మూలముగానె దొంగలు వచ్చినారో? గుఱ్ఱాలకు వైరి గుజ్జుల పాపయ్య మూలముగానె వచ్చినారో? పటాని పాగారాతు మూలముగానె వచ్చినారో? అయినను, బయటి దొంగ గనుక ఆయెనా, నిన్న వచ్చినవాడు యీావేళ మరలి రానే వచ్చును. ఆ దొంగను యీావేళ పట్టిననే పట్టినారు, లేక పోయిన రేపు జాము ప్రొద్దెక్కువఱకు ముగ్గురు సరదార్లను ఫిరంగీవాత పెట్టించెదను'.

అనగానె సరదార్లు ముగ్గురును వచ్చి,

'భగవత్సంకల్పమేమో? మనకే వచ్చెను ఈవాదు. మేలు మేలు! మన మేకర్మ మెఱుగక పోయితిమి. మన సిబ్బందీవాండ్లను మనము నమ్మరాదు.

నంబ్లను పారాచెాకి యందుంచిన ఆ దొంగ దొరకినప్పటికైన పదివరహాలు చేతిలో పెట్టిన దొంగను విడిచిపెట్టుదము, మన ప్రాణము మీదికి వచ్చును.' అని సరదార్లు ముగ్గురు నరసుము గట్టుకొని మూడు దరవాజాల కడకు ముగ్గురును పారా యిచ్చుచున్నారు.

గరిడీలో పోలికె రాముడు సాదన చేసి జాము ప్రొద్దెక్కినప్పటికి భోజనము జేసి అన్నయ్యా, నాకు సెలవు ఇప్పించు', నేను పట్టణము లోనికి పోయివచ్చెదను'.

'పోయిరమ్ముగాని పోలికెరాముడా, దిడ్డి దోవను వెళ్ళి మీ తల్లిని జూచి ప్రొద్దు లేకుండ తిరిగి జాము ప్రొద్దెక్కువఅకు యిక్కడికి రమ్మనెను. మేలు మేలు!

మంచి' దనుచు లేచెను
తాలు బల్లెము దీసెను. తం॥
డాలు బల్లెము ఎందుకురా?'
అన్నయ్యా! విన్నావా,
వస్తాదు బిడ్డేమి
చేత యుద్ధము మఱచునా?
నే నడవిని బోవుచు నుండగను
ఒక పెద్దపులియె వచ్చును
బల్లెము దగ్గర నుండినను
నా ప్రాణము గాచును బల్లెముగా'.
ఆలాగైతే వెళ్లరా'.

పోలికె రాముడు వచ్చెను
గడియ ప్రొద్దు ఉండగను
పట్టణము దగ్గరికి వచ్చెగద.
మంచి నీళ్ల బావొకటి
బొమ్మ జెముడు ఉన్నవి.
ఆ బొమ్మ జెముడులో గూర్చుండె.
రాజుగారి దాదులు
గడియ ప్రొద్దుకాడను
మంచినీళ్ళకు వచ్చిరి.
నీళ్లు తోడుచు నున్నారు.

వారిలో వారు యేమి ఆలోచన జేయుచున్నారనగా, మేలు మేలు!

'కావేరీ, రాత్రి మన పట్టణములోను ఒక ఆశ్చర్యము పుట్టినది విన్నావటె?'

'నే నెఱుగనే పద్మాక్షీ'.

'గుగ్గిళ్ల పోలిసెట్టి యింటిలో దొంగలు జొరబడినారట! ఇల్లు సర్వదుంబా బాగా దోచుక పోయినారట!

'నీ కెట్లా తెలిసినదె?'

'ఆ గుగ్గిళ్ల పోలిసెట్టి వచ్చి మనరాజుతో ఫిర్యాదు చేసినాడు'.

'అందుకు మన రాజు యేమన్నాడు?'

'పట్టణము చుట్టు కోట ఉండగా పరాయి దొంగ యెక్కడనుంచి వచ్చినాడు? ఈ ముగ్గురు సరదార్ల యెఱుకను జరిగిన పనియె కాని యెఱుగని పని

కాదు. బైటిదొంగ గనుక ఆయెనా, నిన్న వచ్చిన దొంగ యీవేళ మరలి రానేవచ్చును. ఆ దొంగను యీవేళ పట్టిననే పట్టినారు. లేని పక్షమునకు రేపు జాము ప్రొద్దు యెక్కువలకు ముగ్గురు సరదార్లను ఫిరంగివాతి పెట్టించు చున్నానన్నాడు. అందుకు సిబ్బందివాండ్లను నమ్మరాదు. సరదార్లు ముగ్గురును పారాచౌకీ యిచ్చుచున్నారు. రాజుగారు చెప్పుచుండగా నేను విన్నాను కావేరీ.' 'వాని తలపండు పగుల! వాని ఆయుస్సు క్రుంగ! ఆ దొంగయె గనుక ఈ వేళ దొరకిన తిరుపతి వెంకటేశ్వర్లకు ఒక దుడ్డు కానుక ఇచ్చెదగదే!' వాని ఆయుస్సు మట్టముగాను! వాని ఆయుస్సు క్రుంగ! ఆదొంగ యీ వేళ చేతు జిక్కిన నేనున్ను మన పట్ణములో గంగానమ్మకు ఒక పోతును వాతపెడుదు గదే!' మేలు మేలు!

ఈ మాటలు అన్నియు విన్నాడు పోలికె రాముడు.

| | |
|---|---|
| బొమ్మజెముడులో లేచెను | 'ఓసెమ్మ! ఇక్కడనె ఉన్నాడె |
| 'ఎవరి తలపండు పగులునె? తం॥ | వీ డెక్కడ దొంగేమి! |
| నేనేనే దొంగను | మనలను చంపి పోవునమ్మా.' |
| నాతల పండు పగులునా?' | నీళ్ల కడవలె పడవేసి |
| బల్లెముదీసెను రాముడు | పట్ణములోనికి ఉరికిరి. |
| వారి వెంబడి బడెను రముడు | వెంబడి తరిమెను రాముడు. |

మా విన్నావా కావేరీ, కస్తూరీ, పద్మాక్షీ, ఓ చెమిటికంటి రమణా! నేను యిక్కడ ఉన్నానని పట్ణములోనికి బోయి చెప్పితిరా మాపటికి మీా నల్గురి ముక్కులు చెవులు గోయుదును. మీా ప్రాణము కాచుక బ్రతుకండి'.

'ఓసి! పద్మాక్షీ, నీ వెవరితోనైనను జెప్పెదవేమో? ఒకరు గనుక కాసంత కొంచి వెళ్ల బెట్టితిరా మననల్గురికి ముక్కులు చెవులు పోయేమాట నిజము. ఎవ్వరితోడను మనము జెప్పనక్కరలేదు. చెమిటికంటి రమణా, నీవు అడలు గుండెదానవు, మాట దాచని దానవు, తలగొట్టి బాస చేసినను నిన్ను నమ్మ రాదు. మన మైదుగురము ఈవేళ ఒక యింటిలోనే పండుకొందము ర'మ్మని,

పట్టపుదేవి మేడమీాదికి వచ్చి దీపములు మట్టించి మేలు మేలు! ఒకగదిలో జాపవేసికొని ఒకళ్ల మీాద ఒకళ్లు పండుకొని చాపయొకటి పైన గప్పు కొన్నారు. రాజసంస్థానంలో మర్యాద యేమనగా, సందెజామున నిద్రపోయి రెండవ జామున భోజనము జేయుదురు; గనుక సందెకాడ పట్టపుదేవి నిద్ర పోయి రెండవ జామున లేచి,

'ఎవరే కావేరీ! చెంబుతో ఉదకము దేవే', అని పిలుచుచునున్నను ఈదాదులు ఎవరు జాడలేను. 'ఏమి, ఎవళ్లు జాడలేకుండ పోయినారు ?'

అని తాను లేచి సెమ్మె చేతదీసికొని చెంబుల నిమిత్యార్థము గదులు అన్నిటిని వెతుకులాడుచున్నది. ఒక గదిలో ఒకళ్ల మీద ఒకళ్లు పండుకొని యున్నారు దాదులు.

'మీరె దొరసానులు అయినారు. మేమే దాదులమైనాము. మంచిది కానీ, తెల్లవారిన తరువాత మీ వీపులు బద్దలు గొట్టించెదను'

అని, 'కావేరీ, కస్తూరి' అని లేపఁగానే,

'ముక్కు పోయె ముక్కుపోయె'

ననుచు ఒకతె లేచినది.

'చెవులుబోయె-చెవులుబోయె'

నంచు ఒకతె లేచినది. సందెకాడ భయము కడుపులో నిండా నున్నది. మేలు మేలు!

'ఏమిటిదే, ముక్కుపోయె చెవిపోయె ననుచు లెగుచెదరు?'

అని పట్టపుదేవి అడుగఁగానె 'మనము చెప్పినట్లైన ముక్కులు తెగగోసి పోగలడు' అని,

'అమ్మా, నిద్రలో కలవరించినాము',

అని, పట్టపుదేవికి నీళ్లు దెచ్చియిచ్చిరి. పట్టపుదేవి భోజనముజేసి నిమ్మళించిన తరువాత,

పోలికె రాముడు లేచెను
దర్వాజకడకు వచ్చెగద
సొక్కు విభూతి దీసెను తం॥
సభ కట్టు గట్టెను
వాకట్టు గట్టెను
సొక్కువిభూతి జల్లెగద
ఆ దరవాజా దాటెను. తం॥
'ఎవరోయి! సరదార్లు,
దొంగను మీరు పట్టుదురా ?
నేనేనోయి! దొంగను
పోలికె రాముణ్ణెఱుగరా ?'
వాండ్లకు నిలువుగుడ్లు పడినవి
అట్లా చెప్పి పోయెను.
రెండవ దరవాజ వచ్చెను
సభకట్టు గట్టెను
వాకట్టు గట్టెను తం॥
మత్తుపొడి జల్లెను
ఆ దరవాజా దాటెను.
మూడవ దరవాజకు వచ్చెను
సభకట్టు గట్టెను

వాకట్టు గట్టెను
సొక్కు బూది జల్లెను.
'ఎవరోయి! సరదార్లు,
దొంగను మీరు పట్టుదురా?
నేనేనోయి! దొంగను
పట్టరోయి! నన్నేమి'.
చెప్పిపోయెను రాముడు.
పెద్ద బజారుకు వచ్చెను
నాలుగు వీధులు జూచెగద
'ఈవేళ యెవ్వరిల్లు దొంగిలుదు? తం॥
ఎవ్వరింటిలో నేమున్నది?
తగిన నగలు లేవేమి
మా తల్లి దగ్గర నున్నవి
మంచి మేలిమి సొమ్ములున్నవి.'
తల్లి మేడకు వచ్చెను
అరియాల పేవేమి
నిద్ర బోవుచునున్నది
సెమ్మె వెలుగుచు నున్నది.
సభకట్టు గట్టెను
మత్తు పొడిని చల్లెను తం॥
గుండ్ల పేరులు ద్రెంపెను
చంద్రహారాలు దీసెను
పూవుల హారము ద్రెంపెను
బన్నసరము దీసెను
నడుమొడ్డాణము దీసెగద
మంగళసూత్రము బట్టుకొని
'అమ్మా! వినవే అరియాలి,
మంగళసూత్రము గావలెను
నీ కోడలికి యిచ్చెదవా?' తం
మంగళ సూత్రము [illegible]
బొత్తిగ [illegible]
రుమాల కొం[illegible]
తండ్రి మేడకు వచ్చెను
తండ్రి నిద్దుర బోవుచున్నాడు
పీకుంభిణి మహారాజు
మంచముకడకు వచ్చెను.
రాజు పండుకొని యున్నది
పగడపు కోళ్ల మంచము.
మంచమువైపు చూచెను
'ఇది భోగముదానికి కావలెనా?'
సభ కట్టు గట్టును
సొక్కు బూది జల్లెను తం
నాలుగు పంగల పుల్లలు తెచ్చెగద
పట్టెలక్రింద యెత్తి పెట్టి
నాలుగు కోళ్లను దీసెను
నాలుగు వెదురు గడలు తెచ్చెను
నవారు గుండ వొప్పించి
యీ పుల్లలమీద యెత్తిపెట్టి
పట్టెలుగూడ దూసికొని
పోలికె రాముడు లేచెను
మలసాని యుండేటి
రాయనుమహాలుకు వచ్చెను.
'ఎవ్వరె, నీవు మలసాని తం
తలుపు దీయ'మన్నాడు.
ఎన్ని పిలిచిన పలుకదుగా.

మా. మలసాని యేమి చేసినదనగా మేలు మేలు

'నిన్న వచ్చినవాడు మరలి నేడు రానేవచ్చును' అని సందేకాడనె భోజనముచేసి యింటిలో నిప్పు లేకుండ పొయిలో నీళ్లుబోసి నుగ్గిళ్ల పోలిసెట్టి యింటిలో తెచ్చిన

నగలును తన నగలను బట్టల పెట్టెలతోకూడ కొట్టులో బడవేసి కొట్టుకు తాళము వేయించి దాదుల ముగ్గురను వెంట బెట్టుకొని యింటి వెనుక కొల్లాలకమైన కాకర పొదయుండగా దానిలో దాదులతో గూడ దాగుకొన్నది. రెండు మూడు మార్లు తలుపు తీయమని పిలిచినాడు. పలికినవారు లేకపోయిరి.

మేలు మేలు!

చెడ్డ కోపము బుట్టెగద
ఒక్క తన్ను దన్నెను
తలుపు ఉతక యూడినది
రామమహాల్‌కు వెళ్లెను
'దీపాలు లేవేమి?
ఎక్కడ బోతివె మలసాని?
ఏడ నున్నావె మలసాని?
నా జీవనమే పోయెను.
మేలిమి నగలు దెచ్చితిగా
నివేడ నున్నావె మలసాని?' తం॥
పొయిలో నిప్పు జూచెను.
'ఔరా! పొయిలో నీళ్లనుబోసెగా'!
తన జేబులో చేయిడుంచెను
చెకుముకి తునుకను దీసెను
అలవా గడ్డి దూసెను
చెకుముకి వేసెను
నిప్పు జేసెను రాముడు
సెమ్మెను వెలుగించె
ఆ సెమ్మెను చేతను బుచ్చుకొని
గదులన్నిటిని వెతకెను.
'ఎక్కడ బోతివె మలసాని?'
మచ్చు మీదికి ఎక్కెను
మచ్చంతా పరిశోధించె
ఎక్కడ జూచిన లేదాయె. తం॥
దొడ్డిలోనికి వచ్చెను
కాకర చెట్టు కాడకు
ఎడమ చేత నెత్తెను
చెట్టునంక జూచెను
మలసాని కూర్చుండె
చేతి చేమపూవు కడియము
తళతళతళతళ మన్నది.
'ఎవతెవె నీవు కూర్చున్నది?'
'ఏమయ్యా, రామయ్యా!'
'ఛీ! లేచిరావే మలసాని,
ఇది యేమే యిక్కడనున్నావు?'
'విన్నావా రామయ్యా?
దాగుడు బూచి ఆడేము తం॥
కనుగొందువా కనుగొనవా
అలాగనుచు నున్నాము;
ఎంతవాడవు రామయ్య
కాకర చెట్టులోగన్నావు?'
'లేచి రావె! మలసాని,
ఇవె మేలిమినగలు దెచ్చితిని
పగడపు కోళ్ల మంచము
నీకు దెచ్చితినె మలసాని
స్నానము జేయవె మలసాని'
పట్టె మంచము వాల్చినది.
ఆ పట్టెమంచము మీదను
ఈ నగలన్నిటిని బోసెను.
ఈ నగలన్నిటిని జూచినది

'దొరసాని నగలేమి !
తెల్లవారిన తరువాత
రాజుగారు విన్నను
నన్ను తలగొట్టి వేయును',
ఆ లాగనుచు మలసాని
దాదుల దగ్గర బిలచెను.

మా. "కావేరీ, కస్తూరీ మీరు రహస్యముగా వెళ్లి పట్టపుదేవిని నిద్ర లేపి 'పట్టపుదేవమ్మా, గుగ్గిళ్ల పోలిసెట్టి యింటిలో మేలు మేలు ! దొంగిలిన దొంగ మలసానియుండే రాయమహల్ మీదికి వచ్చినాడు. పట్టుకునే దానికి ఇదే సమయ'మని చెప్పిరండి."
అనే వఱకు చక్కగాబోయి, మేలు మేలు !

'అరియాల దేవమ్మా,
గుగ్గిళ్ల పోలిసెట్టి
యిల్లు దొంగిలిన దొంగేమి
మలసానుండు మహాలుకు
రాయమహాలుకు వచ్చెను'.
అనగానె అరియాలి
దిగ్గున లేచి కూర్చుండె.
తన మెడ యల్కన గున్నది
నగలు తడవి చూచుకొనె
నగలేమియు లేవాయె
మంగళసూత్రము లేదాయె. తం॥
'వీడెక్కడ దొం !' గనుచు
'నాకే యెసరు పెట్టెగదా',
ఆ లాగనుచు నరియాలి
తనపెనిమిటి యుండు అఱలోకి
భామ కదలి వచ్చెను
పెనిమిటినేమని పిలిచెను
'యేమండి పలుకరు ?
మీరేమండి పలుకరు ?
యేమి నిద్రా లేవరు ?

మా. గుగ్గిళ్ల పోలిసెట్టి యింటిలో దొంగిలిన మేలు మేలు ! దొంగ రాయమహాలు మీద నున్నాడట. నీవు తెచ్చిన బోగందాని యింటి కాడకు నా నగలుకూడను దోచుక పోయినాడు'.
అనగానె ఆ మాట రాజు నిద్రలో విని మేలు మేలు !

దిగ్గున లేచెను
బొక్క బోర్ల పడినాడు
పడి లెగిచె రాజేమి
మంచమువంకను జూచెను
కోళ్లు పట్టెలు లేవాయె
పుల్లలు యెత్తి యున్నది.
'వీడు ఎక్కడి దొంగేమి !
నాకే ఎసరు పెట్టెగద !'

మా. అని అప్పుడు రాజుగారు ముగ్గురు సరదార్లను పిలుపించి, 'నాలుగు వందల సిబ్బందీని ముస్తాదు చేసికొని బోగము మలసాని ఉండు రాయమహాలుకు ముట్టడివేసి దొంగను గట్టిగ పట్టుకర'మ్మనెను. మేలు మేలు !
నాలుగు వందల సిబ్బందీవారు వెళ్లి రాయమహాలును చుట్టుకొని,

'ఎవరే మలసాని, రాజుగారి నగలనన్నిటిని దొంగచేత దోపించుకొని తెప్పించుకొనుచున్నావా? తెల్లవారినగాని నీ పని తెలియదు. ఆ దొంగను బైటికి పంపించు' అని.

'శాబాసు! రామయ్యా,
బాగుగచేసితివి నన్నేమి
నా యింటిమీదికి దెచ్చితివి
నాప్రాణముమీదికి వచ్చెను?'
'విన్నావా మలసానీ, తం॥
నాలుగు వందలు వచ్చినను
వారిని చూచి దడసితివా?
నీకు వచ్చిన భయమేమి?
నీ నగలన్నిటి దే'మ్మనెను తం॥
పచ్చడమును బఱచెగద
కొట్లో నగలు దెచ్చెను
పచ్చడములో వేయించి
బట్టల పెట్టెలతో నేమి
పెద్ద మూట గట్టెను
తన వీపున గట్టికొనె తం॥
మద్దెల మలసాన్ని
ఆపైనను గట్టికొని
యిరువైనాలుగు మూరలది
వెదురు గడను దీసెను
అది గడ్డముక్రిందను బెట్టెగద.
'ఎవరోయి! సరదార్లు!
యెవరోయి! బంట్రౌతులు!',
దొంగను పట్టను వచ్చితిరా?
నేనేనోయి! దొంగను
పట్టుదురుగాని రండోయి!'
'ఓరి! నీవనగ నెంతరా?' అం॥
కదిసి వచ్చిరి సరదార్లు
దగ్గరకు రానిచ్చి
వెదురు గడను యెత్తెను
ఒక్క పెట్టు బెట్టెగద
అక్కడ నూటికి జచ్చిరి. తం॥
ఈ ఖబురు రాజుతో జెప్పిరి
'దెబ్బకు నూటికి జచ్చిరి'
పరాయి దొంగ కాడయ్యా
పోలిక రాముడె చూడగ
చూడగ నట్లగె యున్నాడు.

మా. రాజుగారు ఏమన్నారు:

'పోలికె రాముడె అనుకొనవచ్చును. ఇట్లాగంటి దుర్మార్గపు బనులు చేయువాడు వాడెగాని ఇతరులు చేయలేరు. ఆ పోలికెరాముని ఇక నా కన్నులతో జూచుటలేదు. నాకు అపకీర్తి తెచ్చిన వానిని మేలు మేలు! ఉంచడముకూడదు. మీరు శీఘ్రముగ వెళ్లి పోలికె రాముని పట్టుకొని పెడరెక్కలు గట్టి నంచులవాగునది కడకు దీసికొనివెళ్లి శిరస్సుగొట్టి కనుగుడ్లు రక్తము దొప్పను బట్టుకొని నాకు చూపిననే భోజనము జేయుదును లేకపోయిన యీవేళ నేను భోజనముజేయను'.

అనగానె బంట్రౌతులు తిరిగి వెళ్ళి,

'రాజుగారు గట్టిగా పోలికెరాముని పట్టుకొని శిరస్సు కొట్టమన్నారు? అని అక్కడ ఉన్న సిబ్బందీవారితో జెప్పిరి.

'మనము పోలికె రాముని శిరస్సు గొట్టలేము గాని మన ప్రాణములు అతని చేతులో బోయేటట్లుగ దోచుచున్నది, కాని రాజుగారి మేలు మేలు! ఉప్పు పులుసు దిని ఊరక వెళ్లుదుమా?'
అని, కవ్వించి మళ్లీ పైకి వచ్చిరి. వచ్చినవేళకు ఒక దెబ్బ త్రిప్ప పెట్టెనఅపు యాభై మందికి చచ్చినారు

'అబ్బా! ఇకను పట్టలేము, రాజుయిచ్చే మాహాపలితం యివ్వకపోయినను మానెను గాని ఇంకొక రాజునైనా కొలువుకొని బ్రతికెదము, పదా పోదాము,' అని సిబ్బందీలు తిరుగబడినారు. అంతట తెల్లవారినది. మళ్లి రాజుగారితో వచ్చి, 'మహాప్రభో, పోలికెరాముని బట్టేవారు యెవరును లేరు. ఇప్పటికి నూటయాభై యింటికి చంపినాడు. ఇక యెవరును పట్టువారు లేరు'.

అప్పుడు రాజుగారు పట్టణము నాలుగు వీధులు చాటింపు వేసినారు. ఏమని చాటింపమన్నారు:

'పోలికెరాముని యీరోజున ఎవరు పట్టుకొని వాని శిరస్సు గొట్టి కసు గుర్తురక్తము చూపించెదరో వారికి మూడు ఊళ్లు జాగీరు ఇప్పించుచున్నాము' అని చాటగానె జెట్టీల పినతండ్రులు ముగ్గురు చక్కగవచ్చి, వారె త్రిన వస్తాదులు గనుక

'మహాప్రభో, అది యనగానెంత? పోలికె రాముని మేము పట్టెదమయ్య', అని రాజుగారి దగ్గర తాంబూలము దీసికొని సన్న యినపగొలుసులు వస్త్రతాళ్లు చేత దీసికొని సిబ్బందీ వాండ్లలోనికి వచ్చి,

'మీరు పోలికె రాముని కత్తిని అందకుండ కత్తులు పట్టుకొని సలు! దూసికొని యెదట నిలుపబడి 'పోలికె రాముడా నీవసంగ నెంతలోది, సన్ను కత్తికి ఒక కండగ గోయుదుము. నీవు దాసీ పుత్రుడవు. నీ ప్రాణము మీదకి వచ్చినది కానకుండ పాటుబడుచు ఉన్నావు' అని నూటుమంది అనుచు నుండెడి. మేము దిడ్డి తలుపుగుండ వచ్చి వెనకన్నైపుగ పోలిక రాముని పట్టుకొనెదము' అని వాండ్లతో జెప్పి, దిడ్డితలుపునైపుకు వెళ్లిరి. ఇక్కడ నూటక పోలికె రాముని గవ్వించుచు రోషపు మాటలు ఆడుచు ఉన్నారు. పోలికె రాముడు కన్నులు ఎఱ్ఱజేసి పండ్లు పెటపెట గొఱుకుచు నూటు మందిని చంపను జూచు

చున్నాడు. వీరు దిడ్డి తలుపు ఉతకయెత్తి కాలుకాలు కదలకుండ వచ్చి యీ యినప గొలుసులు మెడకు పడవేసి వెనుకకు వడలాగిరి. మేలు మేలు!

విఱుచుక పడెను రాముడు
పగడపుకోళ్ల మంచము
నడిమికి ఫెళ్లు మన్నది
మద్దెల మలసాని
ఎడమ తొంటికి దెబ్బేమి
బలముగాను దగిలినది.
'శాబాషు! రామయ్యా,
నన్నెంత జేసితివి?'
'నీయింటికి నేవచ్చి
యెంత సుఖము బొందితినో
నీకును అంతె దొరకినది'. తం॥
పైన ముగ్గురు యెక్కిరి
వీపున మూటలు దీసిరి.
పెడ రెక్కలు విఱిచి కట్టిరి
రాయమహల్ నుండి దింపిరి
యాభై యింటికి బంగ్రాతుల్
కత్తుల ఒరలు దూసిరి
పోలికె రాముని దీసికొని
నందులవాగు కాడకు
వెంట బెట్టుకొని వచ్చిరి.

మా. అక్కడ వారు యేమి ఆలోచన జేయుచున్నారనగా,

'అడవిలో కుమారరామయ్య ఉండెగదా. కుమారరామయ్య యెఱుక లేనిది మనము కొట్టడము బాగుగనుండదు. ఆ కుమారరామయ్య ఉండే గరిడీ కాడకు తీసుకొనివెళ్ళి ఆయనకు యెఱుకచేసి మేలు మేలు!
పోలికె రాముని మఱి చంపుదము',
అని ఆపాటుగా, అఖ్యాముందుండే గరిడీకడకు వచ్చిరి. కుమారరాముడు చూచి

'ఇదేమిరా, పోలికె రాముడా; దోమవలె వెళ్లి యీగవలె వచ్చినావు? ఈ కత్తు లేమి, ఈ కటారు లేమి? ఏమఱ్రోయి! మీరంత యితని వెంబడి వచ్చిన పనియేమోయి?'

'మహాప్రభో, పోలికెరాముడు పట్నములోనికి వచ్చి గుగ్గిళ్ల పోలిసెట్టి యిల్లు సాపుగా దోచినాడు. తరువాత మీ తల్లిగారి మేలు మేలు! నగలు సాపుగా దోచినాడు. మీ తండ్రిగారు పండుకునె పగడపుకోళ్ల పట్టె మంచము యెత్తుకవచ్చి మద్దెల మలసాని అనే భోగముదానికి యిచ్చి దాని యింటికడ నుండగా మీ తండ్రిగారికి జాహీరై పట్టుకొని రమ్మని నాలుగువందల సిబ్బందిని పంపించగా అందులో నూట యాభై యింటికి చంపినాడు. మీ తండ్రి గారికి కోపమువచ్చి, 'పోలికె రాముని కన్నులతో చూడను. పోలికె రాముని తలగొట్టి గుడ్లును, రక్తమును యెవరు తెచ్చెదరో వారికి మూడు ఊళ్లు జాగీరు

యిచ్చెదనని చాటించగా, యీ జెట్టీలు ముగ్గురు పట్టుకొని తలగొట్టుటకు తీసుక పోవుచు మీ సెలవులేనిది యేపని చేయకూడదు గనుక మీ దగ్గరకు తీసుకొని వచ్చినాము.'
అనగానె,

'పోలికె రాముని ఒక్కనినె తలగొట్టమని సెలవు అయినదా, ఎన్నకూడ తల గొట్టమన్నాడా ?'

'మహాప్రభో, అంతమాట సెలవు యివ్వలేదండి. పోలికె రాముని న కొట్టమన్నారయ్యా'.

'నా యెదుటికి తీసికొని వచ్చిన తరువాత పోలికె రాముని తలగొట్ట నిచ్చె దనా ? చచ్చితిమా, ఇద్దరము చచ్చువారము; బ్రతికితిమా, యిద్దరము బ్రతుకు వారము'.

'మహాప్రభో, కొట్టకపోయిన రాజుగారు మమ్మి బ్రతుకనిచ్చునా ?'

'అందుకు ఒక ఉపాయము చెప్పెదను వినండి' ఏమనగా, 'ఎవరోయి ! వీరమజెట్టి, వెండికట్ల తుపాకికి యెన్ని వేళ్ల బారు పెట్టినావు ?'

'మహాప్రభో, ఆఱువేళ్ల బారు పట్టెనాను.'
కుమార రామయ్య, ఆ తుపాకిని తీసికొని అడవికి వెళ్లి అడవి సుకను ఒకదానిని పడవేసి దాని కనుగుడ్లు రక్తము దొప్పనుపట్టి తిరిగి గరిడికివచ్చి,

'ఎవరోయి ! జెట్టీలు, ఇది పట్టుకొని వెళ్ళి సులు మేలు !
'పోలికెరాముని కనుగుడ్లును రక్తమునని రాజుగారికి చూపండి. మీ జీవనాలకు విరోధము రాదు'.

తిరిగి వసవల్లి దుర్గమునకువచ్చి రాజుగారియెదుట నిలువబడి మేలు మేలు !

'మహాప్రభో, ఇవిగో, పోలికె రాముని కనుగుడ్లును రక్తమును',
అని చూపగానె సంతోషించి,

'పోలిక రాముడు చచ్చెనా ? యిక నా తాలూకాలో రద్దిలేదు,'
అని, అప్పుడు రాజు స్నానముచేసి భోజనము చేసెను. తదనంతరం కచేరి చావడిలో కూర్చునియుండి జెట్టీల ముగ్గురుని పిల్పించి ముగ్గురికి మూడు ఊళ్లు జాగీరు యిచ్చెను. ఆ తరువాత రాజు యేమి విచారించుచున్నాడు.

'పోలికె రాముని గురించియెకదా కుమారరాముని అడవిలో మంచినది, పోలికెరాముడు పోనేపోయెను. కుమారరాముని పట్టములోనికి పిలుపించవలెను'
అని నౌకర్లను ప్రయాణముచేసి మేలు మేలు !

గరడికి పంపిరి
ముగ్గురు నౌకర్లు వచ్చిరి
వచ్చువఱకు రామయ్య
ఆలోవైనను రామన్న
నేలను భోనుగావించి
పోలిక రాముని
కావులో వేయించి
పైన తలుపులు వేయించె.
జాము ప్రొద్దు వఱకేమి
బైటకి రప్పించి
నాలుగు గడియలు గరడిలో తం॥
సాదన చేయించి
మరల కావున వేయించి
అట్లు బందోబస్తు చేసెను.
నౌకరులు ముగ్గురు వచ్చిరి
కుమార రామునికి
మ్రొక్కువేసి నిలచిరి.
'మీరు ఎందుకు వచ్చితిరి?'
'మీ తండ్రి మహారాజు
మిమ్ము పట్ణములోనికి రమ్మనెను
మమ్ము ముగురిని పంపెను.'
'మంచిది, ఉండండి'
వాండ్లకు అన్నము పెట్టించి, తం॥
'నేను ప్రొద్దున వచ్చెదను
మీరు ముందర వెళ్లండి'.
వారు ముగ్గురు వెళ్ళిరి.
కుమారరామయ్య
జెట్టీలను బిల్పించి
'నేను మరలివచ్చు దాకను
మా తమ్ముని దియవద్దు
అన్నమువేళ మీరేమి
ఆ తలుపుబల్ల తీసేమి
బంగారు పళ్లెములో
అన్నము కూరలు వడ్డించి తం॥
ఉట్టి గట్టి దింపండి?'
అట్లు కట్టుదిట్టము జేసెను.
'ఓరీ! పోలిక రాముడా, తం॥
నన్ను తండ్రిగారు పిల్పించె
పట్ణము వెళ్ళివచ్చెదను
నే వచ్చినదాకా నీవేమి
కావులోనుంచి రావద్దు
జెట్టీల సాదను
ధాముధూము చేసేవు'.
'విన్నావా అన్నయ్యా,
నీ మాటకు నేనేమి
ఎదురుత్తరము చేయుదునా?
మంచిది వెళ్ళండి'.
కుమార రాముడు బయల్ వెడలి
వసవల్లి దుర్గము తం॥
చేరువకు వచ్చెను
రెండుకోసులు ఉన్నది.
రాజుగారిది యేనుగ
మదముదిగి యున్నది
పొలముమీాద విడిబడెను
రెండుకోసుల మేరకు
కుమార రామునికి
ఎదురుగుండ వచ్చెను.
ఏనుగమీాది రౌతేమి
కుమార రాముని జూచెగద. తం॥
'కుమారరామయ్యా,
యేనుగకు మదము దిగినది
పొలముమీాద బడినది తం॥

యెంత పొడిచినను దిగలేదు
దారి తొలగి రమ్మనెను.
'ఛీ! లంజ కొడుక! కుయ్యగరా
దున్నపోతువు తొలిగేదా
కుమారరామయ్యా?'
ఒడిసి తొండము పట్టెగద
ఘీంకారము పెట్టుచు యేనుగ
గీతానాదము బెట్టెగద.
విడిచిన పోవలె నంటుంది
ఎంతమాత్రమును విడువడుగా
తొండము పట్టుక యేనుగను తం||
వెన్కకు వెన్కకు త్రోసెగద
తొండము విడిచి పెట్టెను
వెన్కకు యేడు బారలు దూకెను
ముందర లగువున తేచెను
యేనుగ కుంభస్థలము దన్నెను.
ఒక్క తన్నునకు యేనుగ
కుంభస్థలము పగిలినది
విఱుచుక పడి చచ్చినది.
యేనుగమీది రాతేమి
గోడుగోడున దుఃఖించి
అమ్మో అమ్మో సద్దుకొని తం||
'నా జీవనమే పోయెగద
కుమారరామయ్యా,
నే నెట్టుల బ్రతుకుదును? తం||
ఇక నాకు యేమి జీవనము?
మీ తండ్రిగారితో జెప్పగిన
నా జీవనమే తీరునుగదా'.

మా. "విన్నావట్రా ఓరీ! మాతండ్రిగారు గనుక నీ పనియుతీసిన నిను నేను పోషింతును. కాని ముందర నీవు పట్నములోనికి వెళ్ళి మా తండ్రిగారితో ఏమని చెప్పుదువనగా, 'మహాప్రభో, మన పట్నములో స్వామివారికి కుంభహారతి యిచ్చే యేనుగకు మదముదిగి పొలమువీాద పోవుచుండగా కుమారరామయ్య యెదురుగ వచ్చుచునుండగా, యేనుగకు మదముదిగినది మేలు మేలు! 'తొలగిపొమ్మా' అన్నాను. 'మాట్లాడకు' మని యెగిసి యేనుగ కుంభస్థలము పగలతన్నినాడయ్యా. ఒక్క తన్నుకె యేనుగ చచ్చిన'దని చెప్పు. ఆ పైన యేమని చెప్పునో ఆ వర్తమానము మరలివచ్చి నాకు చెప్పు. నీవు మరలివచ్చు పర్యంతం యిక్కడనే కూర్చునియుందును".

'చిత్తం,'

అని వాడు వసవల్లి దుర్గమునకువచ్చి, రాజుగారు కచేరిని కూర్చునియుండగా మ్రొక్కవేసి నిలువబడి,

'మహాప్రభో, మనవి'

అనెను.

'ఏమి మనవి?'

అని రాజు అడుగగానె

'మన స్వామికి కుంభహారతి పట్టపు యేనుగ చచ్చినది'
ఆమాట వినగనే రాజు తోకత్రొక్కిన నాగుబామువలె నెగిరి

'ఏనుగ యేమి, చావడమేమి? ఎట్లు చచ్చినది?'
అని అడుగగానె, మేలు మేలు!

'మహాప్రభో, యేనుగకు మదముదిగి పొలముమీద విడివడినది. కుమార రామయ్యగారు పట్టణములోనికి వచ్చుచుండగా, యేనుగకు మేలు మేలు! మదముదిగినది, దారి తొలగమన్నాను. లంజకొడుకా! కుయ్యకురా! యని ఏనుగ తొండము పట్టుకొని మూడుఊపులు ఊపి యేడు బారలు వెనుకకు యెగసి యేనుగ కుంభస్థలముమీద తన్నెను. ఒక్కటితన్నునే యేనుగ చచ్చినది,'
అని రాజుతో చెప్పగనె, రాజు అందుకు ఒక సామెత చెప్పుచున్నాడు, అది యేమనగా,

"ఒక సంసారి యొక దున్నపోతునుకొని దానికి ఒక తనగాము వేసి యొక కూలివానిని పెట్టి, 'మా యింటికి నీళ్లు చేరబోయరా' యనిచెప్పెను. ఆ యింటికి యెనిమిది తడవలు గనుక తెచ్చిన సరిపోవును. ఆ కూలివాడు ఏమి చేసినాడు? దబ్బున అవుగాకని మేలు మేలు! యెనిమిది తడవలు తెచ్చు నీళ్లు ఒక తడవకే తనగాము నిండుగ పోసి తోలుక వచ్చెను. ఆ దున్నపోతు గుండెలు పగిలి చచ్చెను. దానికి సొమ్ము ఖామందు చెడినాడా? కూలివాడు చెడినాడా? కుమార రామయ్యాది యేమి పోయినది? నీదేమి పోయినది? నడుమ చెడినవాడను నేనే',
అని చెప్పెను. ఆమాట తిరిగివచ్చి కుమార రామయ్యతో తండ్రిగారు చెప్పిన సామెత చెప్పగానె కుమారరామునికి కోపమువచ్చి,

'తాను సొమ్ముఖావందు అయినట్టు, నేను కూలివాడను అయినట్టు'.

'వీడు ఎక్కడి తండ్రేమి
దున్నపోతు సాటువ తం॥
నాకు యిప్పుడు చెప్పెను
ఇక రాజు మొగము చూతునా?'
వసవల్లి దుర్గము తం॥
పెద్ద బజారున వచ్చెను
తమ తల్లియున్న మేడకు.

అరియాల దేవేమి
కుమారుని జూచేమి
సంతోషము నందెను.
'అమ్మా, అన్నము అయినదా?'
'నాయన, స్నానము చెయ్యండి.'
పోయి స్నానముచేసి వచ్చెగద
బంగారు పళ్ళెములో

పప్పులు పచ్చళ్లు తం॥
పరగనేతి కూరలు
నెయ్యి అన్నము భుజియించి
పాలు అన్నము భుజియించి
హస్తము వెల్చుక కూర్చుండి,
'అమ్మా! వినవే అరియాలి,
నాకు సెలవు యివ్వవె'.
'ఎందాక నాయనా?'
'నేను దేశాంతరము వెళ్ళెదను
నాలుగు భూములు చూడవలె.' తం॥
'నాయన వద్దు నాకుమరా
మఱియు మఱియు ఉన్నారా?
సి వొక్కడవె ఉన్నావు
నాయన నీవు పోవద్దు.'
'ఎంతలేదు పోయెదను'.
'అలాగైతె నాయనా,
మీ తండ్రిగారిని అడగండి
అందుకు యేమి చెప్పునో'.
'నీ డెక్కడి తండ్రేమి
నాకు దున్నపోతు సాటువా?
సాటువ నాకు చెప్పెను
రాజు మొగము చూడనుగా'.
తల్లిమాటను వినడాయె
గుఱ్ఱములుండు సావడిలో తం॥
అగాడిపిచాడి నున్నాది
మేఘరంజి గుఱ్ఱము
స్వామి వరమున బుట్టినది
పంచకల్యాణి తేజీగా.
దానిని బట్టుక వచ్చిరి;
దానికి పన్నెండు సేర్ల పాలేమి
గుఱ్ఱమునకు పెట్టించి
నల్లమందు బిళ్లలుగ
గుఱ్ఱమునకు వేయించి
రెండు సేర్ల సారాజూము తం॥
గుఱ్ఱమునకు పెట్టించి
పచ్చగడ్డి వద్దనెను.
దానిని ముస్తాదు చేసిరి.
కుమార రామయ్య
ముస్తాదెట్లు అయినాడు: తం॥
పకీరు టెక్కా పాగేమి
తలను జుట్టెరామన్న
చీనా చుట్ట దగలేమి
తొడిగెను రామన్న
శిలేబ_త్తరు తొడిగెను
చంద్రాయుధము దీసికొని
తల్లికి దండము బెట్టెను
దీవించె నరియాళి
తాంబూలము నిచ్చెను. తం॥

మా. 'నాయనా, యే భూమికి వెళ్ళెదవు'.

'నాల్గు భూములు చూడవలెనను సంకల్పముచేత వెళ్లుచున్నాను. ప్రాప్తానుసారం ఏలాగు ఉండునో'.

నాయనా, పడమటి భూమికి వెళ్ళవద్దు, దక్షిణ భూమికి వెళ్ళవద్దు, ఉత్తరాదికి వెళ్ళవద్దు, తూరుపు భూమికి వెళ్ళిరా కుమారా'.

'అదేమమ్మా, ఆభూములకు యెందుకని వెళ్ళవద్దు?'

'నాయనా, యీ మూడు దిక్కులనుండు జమీందార్లు అందఱు మీనాయనకు పగవారలే. ఆ జమీందార్లు యెవరంటె పడమటిభూమి ఎఱ్ఱభూపతిరాజు మీ తండ్రికి పగవాడె, దక్షిణ భూమిని ఉండు మేలు మేలు! సుల్తాన్ భూపతిసింగు మీ తండ్రికి పగవాడె, ఉత్తర భూమిని ఉండే ఓరుగంటి ప్రతాపరుద్రుడు మీ తండ్రికి పగవాడె. ఆ భూములకు నీవు వెళ్ళవద్దు'.

'అమ్మా, ఆలాగంటి భూములకె వెళ్ళవలెను. మేలుమేలు!
పగవారిని కన్నులజూచి వచ్చెదను',
అని తల్లిమాటలు వినక జాలె మొహరీలు తీసికొని అశ్వమునకు నమస్కారము జేసి యెక్కి,

ఎడమకాలనుదాటించె
నృత్యము రాజు త్రొక్కించె
మేఘములలో తేచెగద
మేఘరంజ గుఱ్ఱము
ప్రొద్దంతయు నడచెను త ॥
ప్రొద్దు గ్రుంకువఱకేమి
ఎఱ్ఱ భూపతి మహారాజు
పట్ణము జేరను వచ్చెను.
పట్ణము ఊరి ముందర
మల్లెపూవ్వుల వనమేమి
వనములోనికి వెళ్ళెను
అశ్వమునుండి దూకెను
జమఖానా పఱచుకొని
చెట్టుక్రిందను గూర్చుండె.
ఎఱ్ఱభూపతి నౌకర్లు
తూము గంపలు పుచ్చుకొని
ముగ్గురు వారు వచ్చిరి తం॥
మల్లె పూవులు గోయుటకు.
గంపల నిండుగ గోసిరి
ఆ గంపలు నెత్తిని పెట్టుకొని తం॥
తిరిగి పట్ణము పోగాను
కుమార రామయ్య చూచెగద.
'ఎవరోయి పోయేది?'
వారు గిఱ్ఱున దిరిగిరి.
'ఎఱ్ఱభూపతి మహారాజు
నౌకర్లము మే మన్నారు.
'నెత్తిన బరువు లవేమిటివి?'
'మల్లెపూవులని యన్నారు.'
'అవి యన్నియు నెందుకు?'

మా. 'అయ్యా, మారాజు మల్లెపూవులభోగి. నిత్యము యీ మూడు గంపల మల్లెపూవులు కావలెను'.

'ఇవి అన్నియు దీసుకవెళ్ళి యేమి చేయుదురోయి?'

రాజుగారికి పట్టెమంచము వాల్చి ఆ పట్టెమంచము మీద సన్నపాటి పఱుపు పఱచి ఆ పఱుపుమీద యీ మూడు గంపల మల్లెపూవులు పఱచెదము.

ఆ పూవులపై రాజుగారు పండుకొనియెదరు. ఈ పువ్వులు తక్కున్నను రాజుకు నిద్దుర పట్టదు'.

'ఇట్లా దింపండర్రా, ఆ పువ్వులు యేలాగంటివో చూచెదను', అని మూడుగంపల మల్లెపువ్వులను దింపించి జమఖానామీద పోగుబోయించి ఆ మల్లెపువ్వులమీద పండుకున్నాడు.

'పోయి మీ యబ్బతో చెప్పకోండి పొండర్రా, మీ రాజుతో ఫిర్యాదు చెయ్యండి'.

ముగ్గురును వచ్చిరి తం॥
రాజుగారి కొలువుకు
'మహాప్రభో, విన్నారా!
ఒంటి గుఱ్ఱపు రాతేమి
మన పూలతోటలో నున్నాడు.
మేము పువ్వులు దెచ్చుచు నుండంగ
మమ్ము గట్టిగను బిలచెను
గంపల లోనివి యేమనెను.
మల్లెపువ్వు లన్నాము.
ఏవీ చూతము దెమ్మనెను
మూడు గంపలు దీసికొని తం॥
తమ జమఖాన మీద పోయించి
మీ యబ్బతోటి చెప్పండ్రా
రాజుకు ఫిర్యాదు చేయమనెను

మేలు మేలు!
ఆ పాటుగనే వచ్చితిమి'.
'ఓరి! కుంకలారా! మీ రేమి
మీరు ముగ్గురు నుండగను
ఒంటి గుఱ్ఱపు రాతును
విడిచిపెట్టి వచ్చితిరా
తోటకు కావలి పెట్టకను?
ఉన్నాడా పోయినాడా?' తం॥
'అయ్యా! తోటలో పండుక యున్నాడు
మల్లెపువ్వుల మీదను,
యీ పాటికి నిద్రపోయునేమో'. తం॥
ముప్పైమ్ముగ్గురు నౌకర్ల
శీఘ్రముగాను బిలుపించి
'ఒంటి గుఱ్ఱపు రాతేమి
మన తోటలోపల నున్నాడు

మా. వాని అధికారమేమి, వాని బిసాతు యేమి? నాకు తెచ్చు మల్లె పువ్వులు ప్రక్కను బోసికొని పడుకున్నాడట! త్వరగా మీరు ముప్పైమ్ముగ్గురు వెళ్ళి మన తోటకు వానిని కావలి పెట్టిరమ్మనెను.

ముప్పైమ్ముగ్గురును మల్లెపూవుల తోటకు వచ్చి కుమారరామయ్య ఉండె చెట్టు కడ నిలబడిరి. ఈ అలికిడి విని కుమారరామయ్య కన్నెత్తిచూచి, మేలు మేలు!

'ఎవరోయి మీరు?'

'మేము ఎఱ్ఱభూపతి రాజు నౌకర్లము'.

'ఇక్కడికి మీరందరు యెందుకు వచ్చినారు'?

'మా రాజుగారి నిమిత్తము తెచ్చు మల్లెపువ్వులు ప్రక్కను బోసికొనుటకు నీకు అధికారము ఎవరు యిచ్చినారు? నీపేరు యేమి? నీ బిసాతేమి? నీకు మరణకాలము సిద్ధము అయివుండగానె యీలాగంటి దుర్బుద్ధి పుట్టినది'.
అనగానె,

'సరే కాని అంపుకు మీ రాజు ఏమన్నాడురా?'

'ఈ తోటకు నిన్ను కావలి పెట్టి రమ్మన్నాడు'. మేలు మేలు!
కిలకిల నవ్వి,

'సంతోషమే. కాని యీ పాపము పుణ్యము మీ ముప్పైముగ్గురును పంచుకొనెదరా? మీలో ఒక్కడే పంచుకుంటాడా?'

'ఒంటిం పంచుకోవడ మేమి?, మేము ముప్పైముగ్గురమును పంచుకొనెదము.

'ఆలాగైన నమ్ముతేను
మీరు ముప్పై ముగ్గురు త్రవ్వండి
హెచ్చు తగ్గు లేకుండ
సమముగాను త్రవ్వండి.'
ముప్పై ముగ్గురు త్రవ్విరి
కావు పాతర త్రవ్విరి.
'రండోయి! మీరేమి
వచ్చి మీరు ముప్పైముగ్గురు పట్టండి
నన్ను గట్టిగ బట్టుకొని
కావున బడగను ద్రోయండి.'
ముప్పై ముగ్గురు పట్టిరి తం॥
కావువద్దకు తెచ్చిరి.
పడ ద్రోయగను బోగాను
తన సాదన మెరవడి చొప్పునను
త్రిప్పి ముప్పై ముగ్గరిని పడద్రోసె.
మన్నబోసి బిగద్రొక్కి
'పరమపదము వెళ్లండి
కైలాసము ఎక్కడనో
పోయి చూడం' డన్నాడు.
తిరిగి వచ్చెను రామన్న తం॥
మల్లెపూవుల మీదను
మరల పండుకొన్నాడు.

మా. అప్పుడు రాజుగారు యేమి చేసినారు.

'ఈ తుంటలు యెక్కడికి పోయినను అదే పోవడము. నాకు యే వర్తమానము దెలియజేయక బోయిరి. మరల చూచి రమ్మ'
అని నలుగురిని పంపించెను. వారు కుమారరాముని దగ్గరకు చక్కగవచ్చి,

'ఎవరయ్యా, ఇక్కడికి ముప్పైముగ్గురు బంట్రౌతులు వచ్చిరి. మీరు చూడలేదా?'

"ముప్పై ముగురిని చూచితిమి
వారు కైలాసము వెళ్ళిరి
వెళ్లేటప్పుడు వారేమి
నాతో చెప్పి పోయినారు,
'వెనుక నలుగురు వచ్చెదరు తం॥
వారినికూడ రమ్మని
నాతో జెప్పి పోయినారు,
మీరు పోయెదరా ఉందురా?
ఇప్పుడు గట్టిగ వెళ్లితిరా
పరమపదము కాడకు
కలసి పోదురు మీరేమి''.
ఈ మాటకు వాండ్లు జడిసిరి
వెనుకకు వెనుకకు వచ్చిరి
పట్టణములోనికి నలుగురును తం॥

ఏక పరుగున వచ్చిరి
రాజుగారి కొలువునకు.
"మహాప్రభో! విన్నారా,
ముప్పై ముగ్గురు నొకర్లు తం॥
నా యెంటి గుఱ్ఱపు కోతేమి
చంపినాడు యీ వేళ
మేము యిప్పుడు పోవగను
మమ్మును జూచి యేమనెను
'మీరు కైలాసమునకు బోయెదరా?
ఇప్పుడు గట్టిగ వెళ్ళితిరా
పరమపదము కాడకు
కలసి పోవుదురు పొమ్మనెను'.
మాకు గుండెలు పగిలెనిదా
జడిసి వెనుకకు వచ్చితిమి". తం॥

మా. చెప్పగనె రాజు ఆగ్రహుడై,

'ఎవడు ఇటువంటి గుఱ్ఱపు కోతు? కల్లలేని కల్లలు పుట్టించుచున్నాడు. నాకు శత్రుడు అయియుండవలెను',
అని రాజు దిగ్గున లేచి,

'ఎవరోయి! సీలి వెంకటచలం, దాట్ల బాపిరాజు, వంకాలపాటి శేషు', యీ ముగ్గురిని పిలిచి,

'అటువంటి గుఱ్ఱపుకోతు యేలాగంటివాడో చూడవలెను; మన ఆఱు వేల ఫౌంజు హాజరు చేయించు',
అనెను. అప్పుడు వారు శీఘ్రముగావచ్చి గంట వేయువఱకు మేలు మేలు! ఆఱువేల ఫౌంజును హాజరు అయిరి. ఈటెలవారు కొందఱు, బల్లెములవారు కొందఱు, పెనుకత్తులవారు కొందఱు, గుజ్జు కత్తులవారు కొందఱు, తుపాకీల వారు కొందఱు, కాలు కాలు కదలించిన ధరధూళి మేలు మేలు! ఆకాశము గప్పుచుండగా రాజుగారు అంబారీలో గూర్చుండిరి. ఎఱభూపతి రాజు కోటలోనుంచి పూవులతోటకు వచ్చుచుండుటను కుమారరాముడు చూచి

'మూలవిరాటు కదలి వచ్చుచున్నాడు. మనము తోటలోనుండడము యెక్కువ బాగుగ నుండదు'.

అని గుఱ్ఱమును ఎక్కెను
పూవుల తోటకు దక్షిణము
రెండు క్రోసులు యెడమధ్యం
ఎడమధ్యానికి రామన్న
గుఱ్ఱమును ఎగవేసె
రాజు నౌకర్లు చూచిరి తం॥
'మహాప్రభో! విన్నారా,
మన బలమంతయు జూచేమి
జడిసినాడు రాతేమి
అదుగో గుఱ్ఱము నెగవేసి
ఎడమధ్యానికి పోయెనీని.'
'పోనియ్యి వద్ద నెను
వాని రక్తమును జూడవలె
నాలుగు వందల గుఱ్ఱమును
కూడ దఱుముక పొమ్మనెను.
'ఎగవేసి నఱకండి'. తం॥
వీరు గుఱ్ఱములను ఎగవేసి
వచ్చుటను జూచెను
పోవు గుఱ్ఱమును ద్రిప్పెను,
ఈ నాలుగువందల గుఱ్ఱముల తం॥
ఆ గుఱ్ఱాలమీది రౌతులను
పడ నఱకెను రాముడు.
రాజు కాలుబలముల మీదికి
గుఱ్ఱమును ఎగవేసి
తొలివీధి మరలించి
మలివీధి నఱకెను
జీరుకాడె పేగులు
దొర్లాడె మొండెములు
ఆవలించె శిరస్సులు తం॥
కొట్టి కొల్లలాడెను.
తుపాకి దెబ్బకు అందదుగా
కత్తి నఱుకునకు అందదుగా
ఈ బొపోటు తగులదుగా
ఎనిమిది వందల బలముల
చంపెను రామన్న
అంబారీలో రాజేమి
ఈ యుద్ధము జూచుచున్నాడు
ఆశ్చర్య పడినాడు.
'అబ్బ! ఎనిమిది వందల బలముల
ఒక్కడే చంపెను
ఇంకను కవ్వించు చుండినను తం॥
నా బలముల నన్నిటి జంపును.
ఈ చిన్నవానితో మనమేమి
గెల్వంగనులే' మనెను.
కాలుకు ముగ్గుర బొమ్మనెను.
కాలు జెండా లెత్తుకొని
కుమారరాముని యెదుటికి
ముగ్గురు పోయి నిలచిరి.
'విన్నావా, మహారాజా!
'మా రాజు భూపతి
యుద్ధమునకు రాలేదు, తం॥
బలముల నీవు చంపడము
నీకు ధర్మము గాదయ్యా
ఇవిగో కాలు జండాలు.'
కాలనగా రామన్న
'రాజుకు బుద్ధి వచ్చినదా?

మా. ఎదురు మరలినవాని వెన్ను దెగవేయ మన్నారు. పుట్ట లెక్కిన వాని, పూరిగఱచినవాని శవములక్రింద దాగినవాని, రణములో దల విరియబోసికొని పరుగెత్తువాని కావమన్నారు. మనవికి వచ్చెడువానితో మేలు మేలు!

మత్సరమునకు వెళ్లుట న్యాయముకాదు', అని గప్పున గుఱ్ఱముదిగి ఆనెత్తురు బట్టలతోనె జముఖానా వేసికొని కూర్చునెను. ఈకొలువు మేలు మేలు! వచ్చినవారు తిరిగివెళ్లి రాజుతో,

'మహాప్రభో! కొలనగానె కాచియున్నాడు. ఆయన వరప్రసాదిగా నగ పడుచున్నాడు. మీరు సిబ్బందితో వెళ్లక నలుగురు రాచకొమాళ్లను వెంట బెట్టుకొని యాచిన్నవాని దగ్గరకువెళ్లి, ఆచిన్నవానిని మనకోటకు తీసుకరండి'.

'మంచిది',

అని రాజుగారు పదిమంది రాజబంధువులను వెంటబెట్టుకొని కాలినడకను కుమార రామయ్య దగ్గరకువచ్చి,

'ఏ యూరయ్యా మీది? మీ తల్లి పేరేమి? మీ తండ్రి పేరేమి? మీ వంశము ఏమి',

అని అడుగగానె,

'మా వంశము సూర్యవంశము, మాకాపురం మేలు మేలు! వసవల్లి దుర్గము, మాతండ్రి వీరకుంభిణి రాజు, మాతల్లి అరియూస్త్రవి, నాపేరు కుమార రామయ్య'.

'నీవు ఎందాక వెళ్లుదువయ్యా?'

'నేను నిన్ను చూడవలెననియే వచ్చినాను. మాతండ్రిగారికి పగరాజని విని నీవగ యెటువంటిదో చూచెదమని వచ్చినాను'.

'నాయనా, మీకు మాకు పగలేమి? మీరాజ్యము మీరు చేయుచున్నారు. మా రాజ్యము మేము చేసికొనుచున్నాము. వీరకుంభిణి రాజుకు కడుపున ఇంతటివాడవు సుపుత్రుడవు పుట్టితివా?' అని 'రావయ్యా, కోటలోనికి',

'అలాగే వచ్చెదగాని, యీ తాలూకా అర్ధం మేలు మేలు! యెవరికి జమాబంది కట్టుచున్నావు.'

'ఢిల్లీకి కట్టుచున్నాను'.

'ఇప్పటినుంచి ఢిల్లీ పట్నానికి జమాబందికి వెళ్ల నక్కరలేదు. మేలు మేలు!

మా వసవల్లి దుర్గముకు
వీరగుంభిణి కొలువునకు
జమాబందికి రావలెను'.

'మంచిది రామయ్యా.
ఖామందులతో మీ కేమి
మాట్లాడుకునే శక్తుంటె

మే మట్లాగె వచ్చెదను
కోటలోనికి ర'మ్మనిరి. తం॥
'మంచి' దనుచు లేచెను
కోటకు వచ్చెను రాముడు
రాగానె రామునికి,
ఉదక మప్పగించి తోడించి
తొడిగిన బట్టలు విడిపించి
స్నానము జేసెను రాముడు.
పప్పులు పచ్చళ్లు
భోజనము జేసిరి.
'కుమార రామయ్యా, తం॥
పుణ్యానికి మాబలముల
నెనిమిది వందల జంపితివి
ముందు నీ వేల్లు చేసెదవో ?'
'నేను తోటలో నుండంగ
నీ నౌకర్లను బంపించి
నన్ను పాతిపెట్ట మన్నావు
అంతకు యింత చేసితిని'.
అక్కడ మూడు రోజులు ఉన్నాడు.
అక్కడనుంచి లేచెను
గుఱ్ఱముమీద నెక్కెను
'ఏఅభూపతి మహారాజా!
నేను యెప్పుడు ఖబురు పంపినను తం॥
అప్పుడు నీవు ర'మ్మనెను.
అక్కడనుంచి కదలెను
ఆ గండభేరుండ వనములు
గడచెను రామన్న
మద్దులు మారేళ్లు
రుద్రవెలగలే కడచెను

మా. సుల్తాను భూపతియుండు పట్ణము చేరవచ్చెను. దరవాజాకడకు వెళ్లి గుఱ్ఱమును నిలుపువఱకు ఆ దరవాజాకాడ వ్రేలాడ మేలు మేలు! గట్టియున్నవి, డాలు, కత్తి. వచ్చువారు, పోవువారు ఆ డాలు కత్తి క్రిందుగా దూరి పోవుచునున్నారు. కుమారరాముడు చూచి, పారా బంట్రౌతులను హెచ్చరించి, మేలు మేలు!

'ఈ కోటలో నుండు రాజు యెవరురా?'

అనెను.

'మహాప్రభో! కోటలోనుండే రాజు సుల్తాన్ భూపతిసింగు'

అని చెప్పిరి.

'ఏమిరా, బొమ్మరవాండ్లు కట్టుకొన్నట్లు డాలు కత్తి గట్టుకున్నాడు.'

'అయ్యా, తనకు మిక్కిలి సిపాయిలేడని కట్టించినాడయ్యా దరవాజలోను.'

'నేను లోపలికి వెళ్లవలెనే యెట్లు వెళ్లను ?'

'మహాప్రభో! మీరైతే యెవరో మేమెఱుగముగాని మాఖావందు సెలవు తెప్పించుకొని యీ దరవాజగుండనె వెళ్లవలసినది',

'ఒరె! డాలు కత్తి క్రిందగ నేను దూరిపోవుదునా?' మేలు మేలు!
అని గుఱ్ఱమును గుబుక్కున దుమికించి డాలు కత్తి తెగ నఱికినాడు. పారా మీద వున్నవారు పన్నెండుమంది కలపటమైనారు. పదునొకండు మందిని నఱికి వేసినాడు. ఒక్కనిని వర్తమానం చెప్పుటకు విడిచిపెట్టినాడు. తానుపోయి కోటకు కూత వేటునేల, దిరిశనపు చెట్టుక్రింద గూర్చున్నాడు. విడిచిపెట్టిన వాడు సుల్తాన్ భూపతిసింగు కచేరీకివచ్చి నెత్తినవున్న పాగాదీసి నేలనుగొట్టి,

"మహాప్రభో! ఒంటి గుఱ్ఱపురౌతు యెవడో మనదర్వాజా కడకు వచ్చి 'కోటలోనుండు రాజు యెవరు?' అని అడుగగా, మేలు మేలు!
తమ పేరు చెప్పినాము. ఏమిరా దొమ్మరివాడు కట్టుకున్నట్లు త్రోసెలో డాలు కత్తి గట్టుకున్నాడని ఎగిరి తెగనఱికినాడు. మేము పన్నెండుమంది కలపటము అయినాము. కబురు చేయడానికి నన్ను ఉంచి కొదవ పదునొకండు మందిని నఱికినాడయ్యా."

సుల్తాన్ భూపతిసింగు ఆగ్రహమున్ను మండిపడి,

'ఎఱ్ఱభూపతిరాజువంటివాడు నాకు జడియుచు, వీడు ఒంటిగుఱ్ఱపురౌతు ఏమి, వీని బిసాతు ఏమి, నా డాలు కత్తి తెగనఱికినాడు. నాదొమ్మరి గంతులు, వాని ఒడిగలతనమున్ను చూడవలెను. వాడు యెక్కడనున్నాడు?'
అని అడిగెను.

'దర్వాజాకు యెదురుగనె కూత వేటునేల గూర్చునియున్నాడు',
అనగానె, మేలు మేలు!

'ఒంటి గుఱ్ఱపురౌతును గొట్టుటకు నేను కూడా ఉండవలెనా?'
అని పన్నెండువేల సిబ్బంది గలవాడు గనుక ఆఱువందల వస్తాదులను బంపించెను.

'వానిని చంపి నాయెదుటికి తీసుకరమ్ము'
అనెను. ఈ ఆఱువందల సిబ్బంది యీటెలు బల్లెములు భుజమున బెట్టుకొని కత్తులు ఒరల దూసికొని కోటగవనిలో గోవిందపెట్టి బైలుదేరినారు. ఈ ఆఱు వందల సిబ్బంది రాకజూచి కుమారరామయ్య,

'సుల్తాన్ భూపతిసింగునకు గూడ అహంకారమే ఉన్నదా?'
అని దిగ్గున లేచి గుఱ్ఱమును ఎక్కినాడు.

చేతి కత్తిని దూసికొని
శ్రీరాములుల వారిని
మదియందు తలచుకొని
అశ్వముకు ఎగవేసి
త్రిప్పించి మరలించి తం॥
నడికి వేసెను రామన్న.
పీరు యీటెకు పోడువ బోవగను
సోటుకు అందనివ్వదు గుఱ్ఱము
తొలిసిధకి మరలించి
మలిపీధిన నడికెను.
రెంగు మూడు గడియలకు
కోట గపని వడికును
ఆడువందలను నడికెను.
ఈ వర్తమానమును
భూపతి సిగు విన్నాడు తం॥
గడగడ గడగడ వణకెను.

'నరలోక మందున
పుట్టినవాడు అయితేను
ఇంతటి శౌర్య మున్నదా?
'పునాది తెలియదు.
మంచిది పాలకి బైటను పెట్టండి'.
భజంత్రీలను దీసికొని
కళావంతుల దీసికొని
కాలి నడకను దా వచ్చె
ముందర జోడాల నంపెను. తం॥
'మా భూపతిసింగు యిప్పుడుగ
నీతో మనవికి వచ్చెడిని,
అలాగనుచు జెప్పండి'.
జోడాల వారేమి తం॥
కుమార రాముని తావునకు
వచ్చిరి ఇద్దరుగా వారు.
జోడాలను జూచెను

మా. 'ఎవరోయి మీరిద్దరు? ఇక్కడకు యేమి పని యుండి వచ్చుచున్నారోయి?'

'అయ్యా, మా సుల్తాన్ భూపతిసింగు ఆటలపాటలవారిని వెంటదీసికొని చేతులు కట్టుకొని మీతో మనవికి వచ్చుచున్నాడు'.

'మంచిది',

అని సంతోషపడి కత్తినిఒరలో వేయువఱకు సుల్తాన్ భూపతిసింగు యెదుటికివచ్చి,

'రాం రాం' అంటే 'రాం రాం' అనుకొనిరి.

'మీ దేవూరయ్యా? మీతండ్రి పేరేమి? మీ తల్లి పేరేమి? మీవంశమేమి?' మేలు మేలు!

'మాది కాపురము పసపల్లి దుర్గము, మావంశము సూర్యవంశము, మా తండ్రిపేరు వీరకుంభిణి మహారాజు, మాతల్లి పేరు అరియాల్దేవి, నాపేరు కుమార రాముడు'.

'ఆ రాజు కడుపున ఇంతవాడవు పుట్టితివా!'

అని 'ఇట్లు యెందాక వెళ్లుచున్నారయా?'

'మేము యెందాక వెళ్లినావేమి? నీవు జమాబంది యెక్కడికి వెళ్లుచు నున్నావు? రూకలు యెక్కడ కట్టుచున్నావు?'

'ఢిల్లికి జమాబందికి వెళ్లుచున్నాను. రూకలు ... మేలు మేలు! పాదుషాకు కట్టుచున్నాను'.

'అట్లు మీరు ఇక ఢిల్లీ పట్టణము వెళ్ల నక్కరలేదు. మా వసపల్లి దుర్గము నకు జమాబందికి ర'మ్మనెను.

'సరె, యెక్కడనైన మాకు పెట్టు కట్టవలసినది మానునా? ఆ ఢిల్లీ పాదుషాతో మాట్లాడు శక్తి మీదగ్గర నుండిన మీకే మేలు మేలు! చెల్లగట్టుచున్నాము. కోటకు వెళ్లుదము ర'మ్మనెను,

తాను తీసుకవచ్చిన పాలకీలో కూర్చుండబెట్టుకొని బాజభజంత్రీలతో కోటలోనికి వెంటబెట్టుకొనివచ్చి మూడురోజులు ఆకోటలో నున్నారు.

'విన్నావా, భూపతిసింగు! నేను ఊరికి వెళ్లెదను, నేను యెప్పుడు ఖబరు పంపుదునో అప్పుడు మీరు వసపల్లి దుర్గమునకు రావలసినది',

అని చెప్పి, మేలు మేలు!

అక్కడనుంచి లేచెను
గుఱ్ఱమును ఎక్కెను తం||
మేఘములలో ఎగసినది
మేఘరంజి గుఱ్ఱము
పన్నెండు ఆమడ
ప్రొద్దు గ్రుంక వచ్చెను.

ఉరుగుసీ మహాంకాళి పట్టమునకు
రాజు చేరవచ్చెను.
ఆ రాత్రి అక్కడను
నిద్ర భోగించెను.
తెల్లవారు జామున లేవగడ తం||
జాము ప్రొద్దు నెక్కు

మా. ఓరుగంటి ప్రతాపరుద్రుని పట్టమునకు చేరవచ్చెను. సింగుంభణి రాజకుమారుడు కుమారరామయ్యవచ్చి ఎజబూపతిరాజు బలములను జయించి ఢిల్లీ పట్టము జమాబందికి వెళ్లనీయకుండ జేసి వసపల్లెదుర్గమునకు రమ్మని చెప్పిన వర్తమానమును, సుల్తాన్ భూపతిసింగు చేతులు కట్టుకొని యెదురువచ్చిన సంగతియు ఈ యోరుగంటి ప్రతాపరుద్రుడు విని,

'అంతవారే జయించలేక పోయిరి. నేను జయింపగలనా? అతడు అంత శూరుడు గాబోలును. మనకు కలత యెందుకు' మేలు మేలు!

అని భజంత్రీలను పిలుపించి బంగారపు పల్లకీని సైట బెట్టించి వీథి వీథియందును మామిడాకు తోరణములు గట్టించి రెండువందల సిబ్బందిని వెంటదీసికొని భాజా

భజంత్రీలతో పొలిమేర మీదికి యెదురువచ్చెను. జోడాలవారిని ముందు ప్రయాణముచేసి ఓరుగంటి ప్రతాపరుద్రుడు దర్శనమునకు వచ్చుచున్నాడని కుమార రామయ్య దగ్గరకు పంపించెను. వారు వెళ్లి దగ్గర నిలువబడే వఱకు,

'ఎవడో మీకు తెలియునా ?'

'మహాప్రభో, ఓరుగంటి ప్రతాపరుద్రుడు మీరు గొప్పవారు వచ్చినారని మీ దర్శనమునకు వచ్చుచున్నారు. మీతో యీసంగతి జెప్పమని మమ్ము పంపించినారయా.' సంతోషపడి గప్పున గుఱ్ఱముపైనుండి మేలు మేలు ! దూకి కాలినడకను యెదురుగుండ వచ్చుచున్నాడు. వారు, మేలు మేలు ! వీరు కలిసి ఒకరికి ఒకరు మ్రొక్కు వేసికొని,

'వీరగుంభిణి మహారాజు కడుపున యింతవాడవు పుట్టితివా ?' అని సంతోషపడి 'పల్లకి నెక్కవయ్యా, కోటలోనికి వెళ్లుదము' అనెను.

'ఆలాగుననే వచ్చెదగాని, యిదివఱకు మీరు జమాబందీ రూకలు యెవరికి కట్టుచున్నారు ?'

'ఢిల్లీ పహాదుషాకు కట్టుచున్నాము.'

'ఇక యిక్కడనుంచి మీరు ఢిల్లీకి జమాబందీకి వెళ్లవలసిన నిమిత్తము లేదు. మా వసవల్లి దుర్గమునకు జమాబందీకి రావలెను.'

'మంచిది, మీరు ఢిల్లీ పహాదుషాతో మాట్లాడుకొనే శక్తత కలిగిన మీకే రూకలు కట్టుదుము'.

అనగానె పల్లకీలో కూర్చుండి మేలు మేలు !

సకల సంభ్రమములతోడ
పట్ణములోనికి వచ్చిరి.
చుట్టు యేడు కోటలు
సూర్య సోమ వీధులు
ఆటకూటములు దాటిరి
అభువనేశ్వరములు గడిచిరి
పొడుగైన మిద్దెలు
వారు చాల గడచిరి
కోటకు దీసుక వచ్చిరి తం॥
పల్లకినుంచి దిగినారు
మొగసాలకే వచ్చిరి
సాలలో కొలువై యున్నారు.
'భోజనంపు వేళాయె
కుమార రామయ్యా,
లెండయ్యా, స్నానమునకు
భోజనమునకు ప్రొద్దెక్కె'.
అప్పుడు దిగ్గున లేచెను
వెండి కాగుల వేనీళ్లు
పైడి కాగుల చలినీళ్ళు
సమముగా రాజుకు తోడిరి
అప్పుడు స్నానము జేసిరి.

మా॰ బంగారు పళ్లెరములో పప్పులు, పచ్చడులు మేలు మేలు! పరగ నొక్క కూర నేయి నేతిబూరెలును రాజేంద్రుడు భోజనముచేసి లేచి తాంబూలము వేసికొని లక్ష్మీవిలాసములో పరుండెను. అప్పుడు ఓరుగంటి ప్రతాపరుద్రుడు యేమి ఆలోచన చేయుచున్నాడనగా, 'పన్నెండువేల బలము కలవాడనని తాలూకా మీద డబ్బు హద్దులేకుండ యిచ్చుచున్నాడనని యీసంగతి పైన ఖావందుకు తెలిసియున్నది. ఈయన మీద కత్తి కట్టిన మనబలమంతటిని చంపిపోవును. ఢిల్లీ పట్నము జమాబందీకి వెళ్ళకపోయిన వారు మనమీద కత్తి కట్టుదురు', అని ఆలోచన తోచక యేవిధమునైనను మేలు మేలు! కుమారరామయ్యను చంపవలెనని, ఆలోపలనే వఱగడ యోజన కుచ్చెలమేర అడవిని కొట్టించి అనపచేను వేయించినాడు. అది పంటకు వచ్చినది. ప్రొద్దు గ్రుంకగానె వందసిబ్బంది పోయి కావలి చుట్టు ఉండువారు, దేవతా అశ్వములు—పోతూ పెంటి రెండు—పైగానుంచి వచ్చి నడుమ వాలి కుంట, అరకుంట చేను మేసి పోవుచుండెడివి. రాజుగారితో నేమని చెప్పుచుండిరనగా,

'మహాప్రభో, చుట్టును కావలి అయితే ఉన్నాము. చేను నట్టనడుమనె మేసిపోవుచున్నవి, వానిజాడ తెలిసినదికాదు',
అని చెప్పగానె,

'ఓరీ! మీకు వాని ఆకళింపు తెలిసినదికాదు, దేవతా అశ్వములు యేమో వచ్చునట్లున్నవి. అవి వచ్చినప్పుడు సడి కనిపెట్టి మేలు మేలు! తుడుములు, తప్పెటలు, నగారాలు రద్దిచేయండి',
అని రాజు తాకీదు చేసిరి. ఆలాగుననే వారు చేనిచుట్టు కావలుంచి జాగ్రత గని పెట్టుకొని యుండగా రాతిరి రెండు జాములప్పుడు వచ్చి చేను మేయుచుండెగా రద్దిచేసిరి. ఆరద్దిచేత అవి రెండును పైకి లేవబోయి, పోతు అశ్వము లేచిపోయినది. పెంటి అశ్వము నిండు గర్భముతో నున్నది. అదియు లేవబోయిన పాటున దాని కడుపులో నున్న పిండము ఊడి భూమిమీదబడెను.

'పోయె పోయె, పట్టు పట్టు',
అని కమ్మకు నేవఱకు పిల్ల మట్టు ఆఱునప్పటికి ఆఱువందలను చంపెను. చచ్చిన వారు చావగా బ్రతికినవారు పారి పిల్లను పట్టుకొనివచ్చిరి. మేలు మేలు! రాజు చూచి దేవతా అశ్వముపిల్ల దొరకినదని సంతోషపడి పట్టములో నుండిన మనుష్యుల జంపి పోవునని కొండను తొలపించి ఆకొండ గుహలో దానిని బందోబస్తు చేసినారు. ముందర మున్నూఱు వెనుక యేనూఱు పట్టుపగ్గములతో అగాడీ

పిచాడీ చేసి దానికి దానాపాణీ పెట్టి పెంచుచున్నారు. ఎవ్వరిని దగ్గరకు రానీయదు. ముందరకు వచ్చిన కఱపు, వెన్కకు వచ్చిన తన్ను. ఈ ప్రకారముగా నుంచుదానిని బందోబస్తుచేసి యుంటెనిగదా! ఆ గుఱ్ఱమును కుమారరామయ్యను సవారి చేయమనెదము. అదిలేచి దాని తల్లితో కలిసికొనును. ఈయనను ఆపైనుంచి పారవేసిన యెడల యెముకలు బొమికెలు విఱిగిపోవును. ఇదే ఉపాయముగాని యింతకంటె వేఱు ఉపాయములేదని నిద్రలేచి కూర్చునియున్న కుమారరామయ్యతో నేమని చెప్పుచున్నాడనగా, మేలు మేలు!

'నీవు గుఱ్ఱపు సవారీకి మంచిబంటువని విన్నాడను. మాది ఒక గుఱ్ఱము ఉన్నది. ఎవరికిని సాధ్యముగాదు. ఆగుఱ్ఱమును నీవు అలవఱిచి పెట్టవలె', ననగానె బహుసంతోషించి లాగును కాసెకోకను ముస్తాదై యోరుగంటి ప్రతాపరుద్రుడును, కుమారరామయ్యయు ఆ అశ్వముకడకు వచ్చినారు. కుమారరామయ్యను జూడగనె ఆ యశ్వము,

కాలు తాటించినది
కిలారించెను అశ్వము తం॥
'నన్నెక్కెడు పాటి రాతేమి
వచ్చె'ననుచు అశ్వము
ముంగలికాలు దువ్వినది. తం॥
అశ్వమునకు రామన్న
నమస్కారము జేసెను
అశ్వముమీద దుమికెను
అగాడిపిచాడి తాళ్ళేమి
కత్తిని నఱకెను రాముడు
అది మేఘములోనికి యెగసినది
మేఘరంజి గుఱ్ఱము
పన్నెండు గడియలకు
తూర్పు సముద్రము వెళ్ళెను తం॥
అక్కడ స్నానము జేసినది
కాశీకి వెళ్లెను
గయలో స్నానము జేసెను
కాల భైరవుని సేవించి
అక్కడనుంచి లేచెను
పన్నెండు గడియలకు
ఉత్తర సముద్రము వెళ్ళెను
అక్కడ స్నానము జేసెను
తిరిగి పడమటి సముద్రము వచ్చెను
అక్కడ స్నానము జేసెను తం॥
దక్షిణ సంద్రానికి వచ్చెను
అక్కడ స్నానము జేసెను తం॥
మేఘములలో లేచెను
యెనిమిది జాముల ప్రొద్దుకు
పట్ణము చేరగవచ్చెను.

మా. ఆ యోరుగంటి ప్రతాపరుద్రుని పట్ణానకు చేరవచ్చి మున్నుఉండు తావుననె గుఱ్ఱమును బందోబస్తుచేసి కచేరీకి వచ్చుచున్నాడు. ఓరుగంటి ప్రతాపరుద్రుడు ఏమి ఆలోచన చేయుచున్నాడనగా, కుమారరాముడు ఇంకను మన

పట్ణముకకు వచ్చునా? దేవతా అశ్వమును యెక్కుట మేలు మేలు!
మరలివచ్చుట యెక్కడిది? అని అనుకొనుచు నుండగానె కుమారరామయ్య కచేరీకి వచ్చెను. కుమారరామయ్యను చూచుచునె బహుసంతోషపడి కచేరీ మీద కూర్చుండబెట్టుకొని,

'ఎందాక స్వారిమార్గం వెళ్లి వచ్చినావయా?'
అనగానె నాలుగు సముద్రములలో స్నానముచేసి వచ్చినాము. కాశీ విశ్వనాథుని, కాలభైరవుని సేవించినాము',
అనగానె ఓరుగంటి ప్రతాపరుద్రునికి గుండెలలో గుబులు బుట్టె కుమార రామయ్యను బహువందనము చేయుచున్నాడు. మూడు రోజులు అక్కడనుండి నాలుగవ రోజున,

'లేవయ్యా, ప్రతాపరుద్రుడా, వసవల్లి దుర్గము వెళ్లెదము. ననుకనున్న జమీందార్లకుకూడా వర్తమానము పంపించండి. మేలు మేలు!
వారును మనమంత కలసి పోవుదము',
అనగానె,

'మంచిది'
అని ఎఱభూపతిరాజుకు సుల్తాన్ భూపతికి జాబులు బాసించెను మేలు మేలు!
వారు ఆ జాబులు చూడగనే వారివారి బలములతో ప్రయాణముతో ఓరుగల్లు చేర వచ్చిరి. అప్పుడు ప్రతాపరుద్రుడుకూడ ప్రయాణము అయి,

వసవల్లి దుర్గముకు
వారు చేర వచ్చెదరు
ముందరనున్న బలములు
వసవల్లికి వచ్చెను.
వెనుకనున్న బలములు
పన్నెండామడ పొడుగున తం||
దారి బట్టుకున్నది
కుమార రామయ్య
ప్రతాప రుద్రుడు
అంబారీలో నున్నారు.

మా. ముందు వచ్చిన బాహుబలములు డేరాలు వేయించిరి. వసవల్లి దుర్గము కోటచుట్టు ఎడములేకుండ, మంచుకు యెత్తించిరి, మైనపు డేరాలు ఎండకు ఎత్తించిరి. వెల్లపట్టు డేరాలు, గాలికి యెత్తించిరి గోడబారులు, నీడలకు యెత్తించిరి నీలిపట్టు డేరాలు. ఏడు డేరాలనడుమ కలంకారి డేరాలో ప్రతాపరుద్రుడు ఉండేది సిద్ధముగా డేరాలు వేసినారు. వచ్చుబలము వచ్చుచున్నది, దిగు బలము దిగుచున్నది. గుఱ్ఱముల మీద ఢంకాలు సబులుగ వేయువఱకు వీరగుంభిణి మహారాజువిని మూలబురుజు నెక్కి పాఱజూడగా ఓరు

గల్లే ప్రమోసినది, వసవల్లి దుర్గమే ప్రమోసినది, ఉజనీ మహంకాళి పట్ణమె ప్రమోసెను. 'అయ్యో, ఇక నేమున్నది. పగవారు పైకొనిరి. కొమారరామయ్య దేశములపాలై పోయెను. పోలికె రాముడుఉండిన తాలూక నిల్చును. ఎంత వెఱ్ఱి ఆలోచన జేసితిని. పోలికె రాముని ఎందుకు చంపుకొంటిని',
అని యేమియు దోచక రాజు బహు చింతాక్రాంతుడై మేలు మేలు!
కూర్చునియుండగా రాజును గొల్చెడి చతురంగ బలములు రాజును క్రమ్ముకొని యున్నారు, జెట్టీల సినతండ్రులు ముగ్గురునువచ్చి,

'మహాప్రభో, మీకు చింత యేమిటికి ? మీ సెలవు గనుక అయినయెడల పోలికె రాముని దెచ్చెదము',
అనగానె రాజు ఆశ్చర్యపడి,

'చచ్చిన వానిని ఎట్లు తేగలరు ఏమి ?'
అని అడిగెను.

'అయ్యా, పోలికె రాముని చంపిన తావుకు వెళ్ళి సంజీవి పుడక దెచ్చి మేము మంత్రములు జదివి మా మంత్రబలముచేత బ్రతికించెదమయా',

'సరే, మీయంతటి వారు ఇక లేరు, ఈ సమయములో గనుక పోలికె రాముని దెచ్చితిరా పదివేల రూపాయలు ఇనాము యిప్పించెద'
సనగానె వారు ముగ్గురు ప్రయాణమై అరణ్యమందుండు మేలు మేలు!
గరిడీ కిడకు వచ్చిరి. పోలికె రాముడు కావులో నున్నాడు. మేలు మేలు!
కావులోనుంచి బైటికిచేది,

'పోలిక రామయ్యా, మీకు తాలూకా పొయ్యేటట్టుగా నున్నది',
అనగానె,

'అది యేమి ?'
అని అడిగెను.

'మీ తండ్రిగారికి పగవారైన ముగ్గురు జమీందార్లు అనేక బలములు దీసికొని కోటముట్టడి వేసినారు'.

'అయితే, అన్నయ్య లేడా యింటియొద్ద ?'

'మీఅన్నయ్యగారు ఇంటియొద్ద నున్న అంత కార్యము ఎందుకుపుట్టును? కుమారరామయ్య దేశాంతరము వెళ్ళినాడనియు, పోలికరాముడు చచ్చినాడు అనియు వారికి తెలిసి పైకొన్నారు. అందుకు మీతండ్రిగారు ఏమిచెప్పినా

రనగా 'నేను పెద్దవాడను అయినాడను, కాలము తీరినది, ఎదిరించి పోట్లాడు సత్తువ నాకు లేదు. ఈ సమయములో పోలికె రాముడు మేలు మేలు! వచ్చి యీజమీాదార్లనుగొట్టి తాలూకా నిలువుకొన్న వసవల్లి దుర్గము పోలికె రామునికి పట్టము గట్టుచున్నా'నన్నాడు'.

అనగా సంతోషపడి,

'ఎవరురా! నీలి వేంకటాచలం, ఎన్ని వేళ్ల బారు పెట్టినావురా వెండికట్ల తుపాకికి?

'ఆరువేళ్ల బారుతో నున్నదయా పోలికె రామయ్యా'.

ఆ తుపాకీ తానుచేత దీసికొని అడవికి పోయి పెద్దపులిని పడవేసి దాని చర్మము ఒలిపించి శిరసుకడనుంచి పాదముల పర్యంతము దేహము అగపడకుండ నేత్రములు మాత్రము గానవచ్చునట్టుగ అంగరకా కుట్టించి అదిచేత పుచ్చుకొని ఆ పదిమందిని వెంటబెట్టుకొని వసవల్లి దుర్గమునకు వచ్చుచు పట్టము క్రోసుడు దూరము ఉన్నదనగానె డేరాలు, యీబలముచూచి,

'కోటలోనికి పోవుటకు దారిలేనట్టుగా నున్నది. మేలు మేలు! తగిన ఆయుధము చేతులో లేదాయెను, నాతో మీరు కలిసి రావద్దోయి', అని వాండ్లను కడగాపట్టించి పడమట దిగడియ ప్రొద్దుదాక అడివిలో కూర్చునియుండి యీపులిచర్మం అంగరకా తొడుగుకొని పొద్దుగ్రుంకునటకు దగ్గర వచ్చెను. వాళ్లందఱు యుద్ధమునకు వచ్చినవారు గనుక ఆయుధములతో గూడ బందోబస్తుగా నుండిరా? అన్నము వండుకొనుచున్నారు. పోలికె రాముడు ఏమి చేసినాడనగా కాళ్లను చేతులును భూమిమీద ఆనించి ఆ దండు లోపలికి మూడు విల్లెవిరాలు వేసినాడు.

'అదుగో పెద్దపులి',

అని దండంతయు గల్లంతుపడి,

'ఏదిరా కత్తి? తుపాకేదిరా? సాగేదిరా? బల్లెమేదిరా?'

అను వఱకు కోటలోపడెను. మేలు మేలు!

తండ్రి కొలువుకు వచ్చెను
వీరగుంభిణి మహారాజు
కొలువైకూర్చుని యున్నాడు
పోలిక రాముడు
తండ్రిని పడ జూచెను

గుడ్లెఱ్ఱగ జేసెను
వీర గుంభిణి మహారాజు
గడగడగడగడ వణకెను.
'నాయన! రావోయి రాముడ, తం॥
నామీద నీకేమి

ఇంత కోప మొందేవు ? తం॥
నాకు రాజ్యము నీది గదా
కడుపున బుట్టిన కొడుకేమి
దేశముల పాలాయె
పగవారు పైకొనిరి
ఈ రాజ్యము నీవు నిల్పుకొనుము
నీవల్ల శత్రుంటె
పగ రాజును కొట్టుమా
నీకు పట్టము గట్టుదను
వనపల్లి దుర్గముకు
నీవు రాజ వయ్యేదవు'
అలాగనుచు జెప్పెను. తం॥
'మంచి' దనుచు రాముడు
తల్లి మేడకు వచ్చెను
చొక్కా విడిచెను రాముడు
'అమ్మా ! రావే అరియాలి
అన్నము పెట్టు' మన్నాడు
భోజనము చేసి రాముడు
ఆవేళ రాత్రిరి
'ఎప్పుడు తెల్లవారును ?
ఎప్పుడు యుద్ధము జేయుదును ?'
అలాగంటు రాముడు
నిద్రబోవక యున్నాడు తం॥
తెల్లగ తెల్లవారెను
దంతధావనము జేసెగదా
పాలు అన్నము భుజియించి తం॥
'గుఱ్ఱాన్ని తయారుచేయండి
తయారుచేసి యుంచండి'
తెచ్చి గవనిలో నిలిపిరి
లాగు దొడిగెను రాముడు
కాసె కోకను గట్టెను

కయూ.
పులి చర్మమును దొడిగెను
రెండు చంకలను రాముడు
జోడు పటాలు దొడిగెను
చంద్రాయుధము దీసికొని
అరియాలి దేవికి తం॥
అప్పుడు దండము బెట్టెను
నీలవేణికి దండము
దండము బెట్టెను రాముడు.
దీవించి తాంబూల మిచ్చిరి.
గుఱ్ఱమును ఎక్కెను
పక్షివలెను లేచెను
ఎఱభూపతి మహారాజు
దండు లోపలనె దూకెను
ఎడమ కుడి నఱకెను తం॥
చెలగి నఱకెను రాముడు.
వారు యుద్ధమునకు రాలేదు
మందు గుండు లేదేమి తం॥
వారు వీధులు గట్టుక దిగినారు.
ఆ వీధుల వెంబడె పడినాడు
నఱికి గుట్టలు బెట్టెగదా
తొలివీధి మరలించి
మలువీధి నఱకెను.
జీరుకాడె పేగులు
దొరలియాడె మొండెములు
ఆవలించె శిరసులు
అదరిపడెను మొండెములు. తం॥
కొట్టి కొల్ల లాడెను
రక్తధారలు గురిసెను
రావణయుద్ధ మాయెను.
రాజు డేరా దాకను
కోసి గుట్టలు పెట్టెగదా.

.నాడ

చచ్చిన వారు చావగను
మిగత బలము లేచెగదా.
'ఇదెక్కడి దీకర్మము
ఊరును పేరును లేకుండ తం॥
అనులు తెలియక నఱకును
నీడెక్కడి బంటుమి
ఇంత వానిని చూడలేదు'. తం॥

రాజులు గుఱ్ఱము లెక్కిరి
వచ్చిన రాజులు కదలిరి
బలమంతయు దాలెను.
వెంబడిబడి రాముడు
నఱకుచు బోవుచున్నాడు
మూడు క్రోసులు గొట్టగదా.

మా. అక్కడనుంచి గుఱ్ఱమును మఱి యిపతిల అనతిల పరింజుకి పోవు బలముమీద పడి నఱకుచున్నాడు. ఈ ముందర పోయిన వారు కుమార రామయ్యను కలియగనె కుమారరామయ్య, సులు సులు

'ఏమిరోయి! మఱలి వచ్చుచున్నారు?',

అని అడుగగనె,

'మహాప్రభో, ఏమి చెప్పను? డేరాలు సిద్ధముగా వేసి పొద్దున అన్నము వండుకొనుచుంటిమి. పెద్దపులిచర్మము అంగరకా తొడుగుకున్నాడు. గుఱ్ఱము నెక్కి ఒక్కడే దండుమీదపడి అనేక బలమును నఱికివేసినాడు. ఇంకను వెంబడించి తఱుముకొని వచ్చుచునే యున్నాడు. ఆయన ఎవ్వరో సది సూమా తెలియలేదు. ఆయన యుద్ధానికి తాళలేక సుమా జడిసి డేరాలు విడిచిపెట్టి పాఱిపోయి వచ్చినామయ్యా'.

అనగానె, మేలు మేలు!

'వాడు మా తమ్ముడేను; మీరు పోయిన సంగతి తెలియక మాతండ్రికి పగవారు వచ్చినారని యుద్ధము చేయుచుండును. ఈ శిఖా మొహరు తీసికొని వెళ్ళి మా తమ్మునికి అగపఱచితిరా మీకు వచ్చు ప్రాణహాని లేదు',

అని చేతికి ఇచ్చి పంపించెను. వచ్చి పోలికె రాముని సులు సులు! గలసికొని,

'ఇదుగోనయ్యా, మీయన్న కుమారరామయ్య శిఖా మొహరు యిచ్చి పంపించినాడు'

అని చేతికి యివ్వగానె, అప్పుడు పోలికెరాముడు గుఱ్ఱమును గప్పున దుమికి,

'ఈ బాహుబలమంతయు నెవ్వరిది? మా అన్న కుమారరామయ్య ఎక్కడ నున్నాడు?'

'వెనుక అంగారీలో వచ్చుచున్నాడయా. ముగ్గురు జమీందార్లను వస వల్లి దుర్గమునకు తీసికొని వచ్చుచున్నాడు',

'అయ్యో, ఎంత వెఱ్ఱివాడ నయితిని, ఏల యుద్ధము జేసితిని? మాఅన్న మీాద కత్తి గట్టి వాడనయితిని, ఇంకను నేను బ్రతికి యెందుకు? అన్నయ్య పాద ములకడ ప్రాణము వదలెదను'

అని ఎదురుగా చక్కగా వచ్చెను. వచ్చి అన్నయ్య పాదముల మీాదబడి,

'ఇక నేను బ్రతుకను అన్నా',

అని బాకు దూసెను. తమ్ముని చేతిలోని బాకు అన్న నిల్వబట్టి,

'తమ్ముడా, నీకు వచ్చిన భారమేమి ?',

'అన్నా, నీమీాద కత్తికట్టి ఇంకను నేను బ్రతుకుదునా ?'

'తమ్ముడా, తెలియక చేసినాడవు. ఇందుకు నామనస్సులో నెంత మాత్ర మును సందేహము లేదు. ముగ్గురు జమీాందార్లను మనకోటకు జమాబందికి తీసికొని వచ్చినాడను',

అని రాజులను డేరాలలో నుండమని,

| | |
|---|---|
| అన్నాదమ్ము లిద్దరును | జమాబంది గావించి |
| గుఱ్ఱములను ఎక్కిరి తం॥ | రసీదులను ఇచ్చిరి |
| తండ్రి కొలువుకు వచ్చిరి | వారికి భోజనము బెట్టిరి |
| నమస్కారమే చేసిరి. తం॥ | దుసాలువ లిచ్చిరి తం॥ |
| 'విన్నావా! నాయనా, | వారికి సెలవులు ఇచ్చిరి. |
| వీరగంభీర మహారాజా ! | ఎవ్వారెవ్వారి భూములకు |
| మీా పగవారిని ముగ్గురను | వారి కోటలకు వచ్చిరి. |
| జమాబందికి దెచ్చితిమి.' | అన్నాదమ్ములు ఇద్దరికి |
| రాజు ఆనందము నొందెను | తండ్రి పెండ్లి ప్రయత్నము జేయించె |
| ముగ్గురు రాజుల బిల్పించి | ఈ యత్నములో నుండంగ |

మా. ఢిల్లీనుంచి ఎఱ్ఱభూపతిరాజు పట్నము అర్థము నిమిత్తము గుఱ్ఱపు సవార్లను పంపించినారు. వారు వచ్చి, మేలు మేలు !

'లే లేవయ్యా, ఎఱ్ఱభూపతి రాజా, ఢిల్లీ పట్నము వెళ్ళవలెను. సాలు ఝూడాగా పైకము పట్టుకొని వచ్చిన నీ మానము దక్కుచున్నది లేక పోయిన నిన్ను కాచునని మాకేమియు దోచలేదు',

అనగానె,

'మేము ఢిల్లి పట్ణము వచ్చుటకు మాకు పనిలేదు. వసవల్లి దుర్గములో మేము జమాబంది తీర్చుకున్నారము. ఆ వీరగుంభిణి మహారాజు మనసు, ఆఢిల్లీ పహాదుషా మనసు',

అని వచ్చినవారికి భత్యమైనను యివ్వకపోయినారు. వారు తిరిగి ఢిల్లీపట్ణము వెళ్ళి వారి ఖావందుతో నీ వర్తమానము ఎఱుకచేసినారు. సహురు మీద కూర్చునియున్న ప్రభువుకు మహాకోపము వచ్చి,

'పాళెగాడు వీరగుంభిణి రాజుకు యింత శౌర్యము వచ్చినదా ?'

అని అసానల్లీ ఖానుని పిలుపించి,

'పన్నెండువేల లష్కరు వెంబడి బెట్టుకుని వసవల్లి దుర్గమును గొట్టి ముగ్గురు జమీన్దారులను వెంట బెట్టుకొని నా ఉదుటకు రమ్మ',

అని సెలవాయెను. అప్పుడు అసనల్లీ పన్నెండువేల బలమును నెంటబెట్టుకొని ఎఱ్ఱభూపతిరాజు పట్ణము వచ్చెను. సుల్తాను భూపతిసింగును మేలు మేలు ! ఓరుగంటి ప్రతాపరుద్రుని, ఎఱభూపతిని వెంట బెట్టుకొని వసవల్లి దుర్గము వచ్చెను. కోటచుట్టు దిగుచుండగానె కుమారరామయ్య చూచి, తమ్ముడును, తండ్రియు గచేరీలో నుండగా తండ్రితో జెప్పెను.

'ఢిల్లీ పహాదుషా బలమువచ్చి కోటచుట్టును దిగుచున్నది',

అని చెప్పగానె,

'నాయనా, కార్యము పెంచితివి గదోయి, పహాదుషాలమీద మనముకత్తి గట్టి జయించగలమా నాయనా ?' మేలు మేలు !

'పహాదుషా అనగా నెంతలోనిది, ఢిల్లీ పట్ణములో హాసనల్లీకి గోరి కట్టించిననే నాపేరు కుమారరామయ్య అను', అని

అన్నాదమ్ములు లేచిరి
లాగులను దొడిగిరి తం॥
కాసె కోకలు గట్టిరి
అంగరఖాలు దొడిగిరి
పైన ఉక్కుజీరా తొడిగిరి
పట్టాలు దీసికొని
గుఱ్ఱముల నెక్కిరి
కోట బైలు వెడలిరి
శ్రీరాములను దలచిరి

బారులు బారులు ఆకిరి
వారు తుపాకీ పేల్చగను
వీరి యుక్కుజీరా మీదను తం॥
టక్కుటక్కున తగులును
దానికి లక్ష్యము పెట్టరుగ
డేరాల కాడకు
కోసి గుట్టలు వేసిరి
అసానల్లి ఖానేమి
గుఱ్ఱముమీద ఎక్కెను

నాలుగువందల గుఱ్ఱపుతో
వచ్చిన దారిన తిరిగెను.
ముస్లిము బహూద్దారులు
లంజెకు మీందే బోయిరి
ఇంతవాళ్లు గనుకను
ఇంత లెక్క సాధించె.
వారు ఢిల్లీ పట్నము వెళ్ళిరి

తం॥ వీరు వెంబడి తఱుముచు బోయిరి
పోవు పోడుగనను నఱికిరి
వారిని ఢిల్లికోటకు బాఱదోలి
వీరు కైకోట తాళము వేసిరి
తాళముల మీదను
శిక్కా మొహర్లు వేసిరి.
ఎఱ్ఱభూపతి పట్నము

మా. ఉత్తర భాగమున చెఱువుకడ వనములో దిగినారు. అక్కడ చాకాలు అవి విడిచి ఆ చెఱువులో స్నానముజేసి భోజనము ప్రయత్నము జేసికొనుచుండిరి. అక్కడ ఢిల్లీపట్నములో అసానల్లిఖానుడు షుఖురుల్లా అనేవాడు ఇరువన్నె వేల బలము వెంటబెట్టుకొని దిడ్డిదోవను బైలుదేరి అడవియంచున పట్టుకొని వచ్చుచున్నారు. శ్రీరాములవారు లక్ష్మణపెరుమాళ్లు అమ్మవారు కూర్చునియుండి స్వామివారితో నేమని మనవిచేయుచున్నది, అమ్మవారు,

'స్వామీ, ఆలాగంటి రాజులకు మహత్తైన బలమువచ్చి ఇంతబలముకు పంపుటకు కారణమేమి ?'

అనగానె, స్వామివారు పాఱజూడగా,

'వెనుక ఇంతబలము వచ్చియున్నది. ముందు యింకను చావబోవుచున్నది. కారణములేని యుద్ధము అయినది',

అని ఆంజనేయులను పిల్పించి,

"ఆంజనేయా, ఫలాని వనములో వారు ఇద్దరు భోజనము జేయుచున్నారు. నీవు మాయవేషముచేత వెళ్ళి 'శ్రీరాములవారు మిమ్ముల మెచ్చుకొన్నారు. ఆ! ఆ! ఎంత యుద్ధము జేసినారు. మీ దేహమంతట చెమట ఊరుచున్న'దని నొసటి వ్రాలు తుడిచి రావోయి",

అనెను. అప్పుడు, ఆంజనేయులు చక్కగావచ్చి వీరిద్దరిని కలసికొని చెమట దుడిచి అతను మాయమైపోయెను. వీరు భోజనముజేయువఱకు అడవి యంచు గుఱ్ఱము గలగలమని పోవుచున్నది.

'అన్నా, ఇంక నేమున్నది. అసనల్లిఖానుడు మరలి వచ్చెను',

అని దిగ్గునలేచి గుఱ్ఱము నెక్కిరి,

ఉప్పుజీరాలు మరచిరి
అడ్డముబోయి కలసిరి

విడువక గత్తుల నఱికిరి
అనేక బలముల జంపగను

అసానల్లీఖానేమి
అంబారీలో చూచెను
వారిద్దని జూచెను.
'మన మింత బలము ఉండగను
వెనుక దీసి పోవుదుమా ?
తుపాకులె మానండి
బల్లెములను దీసికొని
గట్టిగుండె చేసికొని
పోయి నూఱుమంది దుముకండి
బల్లెములచే గుమ్మండి
ముప్పై ముగ్గురు దుముకిరి
గుఱ్ఱములను పొడిచిరి
వీరు భూమి మీదికి దూకిరి
పరవడి యుద్ధము జేసిరి
ముప్పైమూడు బల్లెములు
అన్నాదమ్ము లిద్దరికి
ఒక్కసారె గ్రుచ్చిరి
భూమి మీద నొరగిరి.
శ్రీరామం రామం
శ్రీరాములను దలచుకొని
మోకారించుక నొరగిరి
స్వామి పూవుల రథమును బంపెను
పూవుల రథము మీదను
ఇద్దరిని ఉంచుకొని
బొందితోడ కైలాసం
వారిని తీసుక వెళ్ళిరి.
పాచ్చావులె చూచిరి
'ఇంతవారని యెఱుగము
ఎఱుగక మేము పొడిచితిమి
కుళ్లాయీలు తీసిరి
వంగి సలాములు జేసిరి.
వీర కుంభిణి రాజును
తమ యెదురునకే పిల్పించి
కొమాళ్లు వెళ్ళిన సంగతి
రాజుకు దెలియజేసిరి.
రాజు దుఃఖము పడగాను
'జడియకుమోయి మహారాజ !
వసవల్లి భూములు
నీకు జాగీరుగ నిచ్చితిమి
నీవే ఏలుకొను' మన్నారు
వీరు తిరిగి తిరిగివచ్చిరి.
వీరగుంభిణి మహారాజు
తిరిగి కోటకు వచ్చెను
వీరికి దినవారములను జేయించె
అనేక దానముల జేసెగదా
వసవల్లి భూములు
సుఖోపాయముగ మహారాజు
రాజ్య మేలుచు నున్నాడు.

కుమారరామయ్య కథను విన్నవారు అనేక సౌభాగ్యములు పొందుదురు.

—: సంపూర్ణము :—



## ఉపబంధము



అంగరఖా P. *angarkha*

A jacket చొక్కాయి—Brown.

పైన ధరించుకొను చొక్కాయి. (శ.ర)

అంగములను రక్షించునది. (సూ.ఆం.ని.)

నిఘంటు కర్తలందరు దీనిని విదేశపదముగ గ్రహించిరి. సంస్కృత 'అంగరక్ష' శబ్దములనుండి యేర్పడిన తద్భవరూపమైనఁగా నగును.

'పెద్దపులిచర్మము అంగరకా'— పుట 72

అగాడి పిచాడి. H. *agadi pichchhadi*

గుఱ్ఱము వెనుకటి కాళ్లకును ముందరి కాళ్లకును కట్టు పగ్గములు.

అదుపు (రూపాంతరము హదుపు) P. *adab*

Respect, politeness, awe భయము.

అదబులో నుంచుట to keep in awe—Brown.

అములు (అమల్) P *'amal*

Rule, reign, sway, government, an office or post, execution, fulfilment—Brown

'ఊరును పేరును లేకుండ

అములు తెలియక నడచును'—పుట 72

అమలు అనగా నిచట (నీతి) నిబంధనను లేకుండ అని యర్థము చేసికొనవలసి నట్లున్నది.

అరమాషీ. P. *armashi*

'అరమాషీ పురుమాషీ'అనియే యీకథయందు ఈమాటలు వాడబడినవి. 'అరమాషీ పురుమాషీ ఖర్చు' అని పుట 9. బ్రౌనుగారు, 'అరమాషు ఫరమాషు' లేక 'అర్మాయిషి ఫర్మాయిషి'అని యుదాహరించి, *farma'ish* Provision supplied gratis, 'దయను కొని ఉచితముగా యిచ్చే సామగ్రి' అని అర్థము వ్రాసినారు. కిట్టల్ కన్నడ నిఘంటువు 'అర యిషి ఫరయిషి అరిమాసి పరమాసి' అని గ్రహించి, A gift or gifts of rare and striking value అని యర్థము వ్రాయబడియున్నది.

అరమాషి పురుమాషి ఖర్చు అనఁగా ఉచితముగానిచ్చు కానుకలు మొదలైన వానికగు వ్యయము.

అలకన. 'తనమోము యలకన గున్నది'. పుట 46

ఇచట ఈమాటకు శూన్యము అని యర్థము. దీనిని శబ్దరత్నాకరకారులు దే.విణ. అనఁగా దేశ్యవిశేషణముగ గ్రహించి, 'సూక్ష్మత' 'సూక్ష్మము' అని యర్థము జెప్పినారు. వీని కాధారముగ హరివంశము ఉత్తరభాగము 2 -వ ఆశ్వాసములోని (౧౯౩) 'అలకని తెల్వి' యను పద్యమును, స్వారోచిష మను సంభవము ౽-వ ఆశ్వాసములోని (౩౦) 'అలకని జేబు'అను పద్యమును ఉదాహరించుచు. 'విశేషణమైనప్పుడు సమాసమునందు కడపటి అకారమునకు ఇకారము వచ్చెడి' అని వివరించినారు. సూర్యారాయాంధ్ర నిఘంటు కర్తలు, 'అలకన. వి. (✓ అలక) పలుచదనము' అని యర్థనిర్ణయము గావించినారు. మఱియు, 'అలక'. విణ. (హిం. అల్కా. హాల్కా).దీనికి కర్మధారయమందు నిగాగమము వికల్పముగా వచ్చును' అని వివరించి, మనుచరిత్ర లోని (౬ ౩౦) 'అలకనిజేబులో' అను పద్యము నుదాహరించినారు. ప్రస్తుతము విచారణీయాంశ మేమనఁగా ఈ 'అలకన' శబ్దము శబ్దరత్నా

కరకారులన్నట్లు దేశ్యమా లేక సూర్యారాయ నిఘంటు కర్తలు జెప్పినట్లు హిందీ భాషయందలి 'అల్లా' లేక 'హాంక్' యను పదమునుండి పుట్టినదా ?' అని పరిశీలించి చూడఁగా నిది హిందీ శబ్దభవముగాదని తోఁచుచున్నది హిందీ మహమ్మదీయ యుగమున రూపొందిన భాష. క్రీ.శ. ౧౫-వ శతాబ్దమున గాని దానియందు వాఙ్మయము బయలువెడలినది కాదు. హిందీ భాషకు దక్షిణదేశమున మహమ్మదీయుల రాకకుముందు ప్రసారము లేదు శబ్దరత్నాకరకారు లుదాహరించిన మొదటిపద్యము ఎఱ్ఱాప్రగ్గడ హరివంశములోనిది. ఎఱ్ఱాప్రగ్గడ క్రీ.శ. ౧౪ వ శతాబ్ద మధ్యమున తీరాంధ్ర దేశమున వెలసెను. అప్పటికింకను నాంధ్రభాష పరిశుద్ధతను గోల్పోలేదు. అరబీ పారసీ పదములు శ్రీనాథుని కాలమునుండియె యాంధ్ర గ్రంథములందు గానవచ్చుచున్నవి.

అలవగడ్డి. పశువుల గాడియందలి గడ్డి,
'పశువుకి తునుకను దీసెను
అలవాగడ్డి దూసెను'—పుట 45.

ఆకులమోద. ఆకులకట్ట.
A small packet or parcel of betel leaves. —Brown.

ఆగ్రహుఁడు. కోపము జెందినవాడు.

ఆటకూటము. నాట్యమందిరము.
A dancing hall.
'ఆటకూటంబులో నయోధ్యలోను
నట్టింట సీతమ్మ నాయకము జేసె'—పాట.

ఆదా. ఆదాయము.
ఇది ఒకవేళ పార్సీ [illegible] కానవచ్చును. అగునేని దీనికి నిలువయని యర్థము జెప్పుకొనవలయును.

ఇనాము. P. *in'am*
బహుమానము, మాన్యము.
'ఇనాము' అనియె వాడుకయందున్నను, శాసనములందును గ్రంథములలోను 'ఈనాము' అనియె కానవచ్చుచున్నది
'...దెలిపి నంగని వీర్లని రంగరాయని గార
లీనా మొసంగిరి భూనుతముగ'
*Further Sources I. No. 54*
'కరిమయూరమరాళికలకు నొయ్యార మీనా
మిచ్చి' —వరాహపురాణము ౪-౧౫౯

ఉదురుకు. P *huzur*
సమక్షమునకు, సముఖమునకు
to the presence.
'ముగ్గురు జమీందారులను వెంటబెట్టుకొని
నా ఉదురుకు రమ్ము' అని సెలవాయెను.
—పుట 74.

ఏకశోకము.
'హేకశోక'మని వాడుక భాషయందు రూపాంతరము.
విడువని దుఃఖము, నిలుకడలేని యేడుపు.

ఏపుదిండు. పెద్ద లేక పుష్టియైన తలగడ.

కంగిపట్టించు. సరిచూచు.
'సాలుగుడసూత్రాలెక్కలు కంగిపట్టించగా ...
ఖర్చుపోగా...ఆదా కనుపడినది'.
—పుట 9.

కచేరి. H *kachheri*
అధికారవిచారణ జరిగేయిల్లు. Office.

కబురులు. P *khabar* సమాచారములు.

కలంకారి. P. *qal ımgari*
ఒక తరహా వ్రాతవన్నెగుడ్డ. తూలికతో వర్ణము వేసిన గుడ్డ.

కీర్ణాలకము. అల్లిబిల్లిగ నల్లుకొనిన.

కుంట. భూపరిమాణ విశేషము.

కుంబెన కుచ్చులు. కుంబెండ్లు. బంగారుతో జేసిన పెద్ద కర్ణభూషణ విశేషము. ఈడ్పులనెడు కర్ణభూషావిశేషము. జామికీలు కావచ్చును.

కుంభిని. ఇంగ్లీషుమాట
Company దళము, సమూహము,

కుంభిణీ కోట.

దుర్గవిశేషము. [illegible]

[illegible].

కాంచి. (గంచి) P. qimchi [illegible], [illegible].

కుచ్చెలు. [illegible]

కుప్పటము. [illegible], [illegible], [illegible]ము.

కుర్చీ. పార్సీ (kursi) నుండి [illegible] ఎక్కువమాట. [illegible] A chair.

కుల్లాయి. P. kulah

తెనుగుమాటకాదు. పార్సీనుండి ఎక్కువ తెచ్చుకున్నది. చిన్నటోపి.

'కుల్లాయుంచితి కోకసుట్టితి
జటిసూర్పాసముగా దాసితిని'
—శ్రీనాథుడు.

శబ్దరత్నాకరకారు లీమాట వైకృతమనిచెప్పినారు; సూర్యారాయాంధ్ర నిఘంటు కర్తలు ఇది 'ఖోలకః' అను సంస్కృత శబ్దమని సూచించినారు. శ్రీనాథునికి ముందరి వాఙ్మయమునం దీశబ్దము వాడుకయం దుండినట్లాధారమేమియు గానరాదు. శ్రీనాథుండే యరబీ, పార్సీ మున్నగు నన్యదేశ్య పదములను బ్రయోగించుటకు దారి చూపినట్లున్నది.

కౌలు P qaul అభయపత్రము.

'కౌలుకు ముగ్గుర బొమ్మనెను'. పుట. 59

ఖజానా P. khazana ధనాగారము.

ఖర్చు P. kharch వ్యయము.

ఖావ(వ)ందు P. khavand ఒడయుడు.

ఖావందు అని సామాన్యముగ వాడుకయందున్నను ఖావందు అనునదియె సరియైన రూపము.

ఖాయిదా P. qa'ida విధి, నిర్ణయము, కట్టుబాటు.

ఖు[illegible]. సంతోషము.

ఇది ఖుష్ (khush) అను పార్సీమాటనుండి [illegible]. [illegible]

[illegible] సామాన్యముగ [illegible].

గౌలు P qaul కౌలు.

గజ్జెల యొడ్డాణము. గజ్జెలుగల యొడ్డాణము. ఒడ్డాణము. 'స్త్రీలు నడుమున బిగికై ధరించుకొనెడు బంగారు [illegible] వాని పట్టెడ'.
—(శ.ర.)

గల్లీ P. galli సందు.

గోరి P. gor సమాధి.

'ఢిల్లీపట్నములో మాపనల్లికి గోరి కట్టించిన నే నాపేరు కుమారరామయ్య'.—పుట 74.

చంద్రవంక. అర్ధచంద్రాకృతిగల స్త్రీ శిరోభూషణ విశేషము.

చిటికెన బొద్దులు. స్త్రీలు కాలి చిటికెనవ్రేళ్ళయందుంచుకొను భూషావిశేషము. (శ.ర.)

చేమపూవు కడియము చేమపూవు చెక్కిన కడియము. స్త్రీలు హస్తముల ధరించునది.

జండా H jhanda ధ్వజస్తంభము.
—Brown.

టెక్కెము, ధ్వజము. (శ.ర.)

జమఖానా. P. jamkhanah

జముకాళము, జముకాణము, బంబుకాణము, జమ్ముఖాణము అనిరూపాంతరములు.

'కూర్చుండుటకై ముతుకనూలితో నేసి క్రింద పఱచెడి ఆస్తరణ విశేషము' (సూ.అం.ని.)

A Carpet—Brown.

'క్రిందవేసి కూర్చుండెడి ముతక నూలితో నేసిన పట్టె'
—శ.ర.

జమాబంది P. jama'bandi సిస్తు యేర్పఱచుట

జర్రిపట్టీలు. బాలక్రీడా విశేషము.

జాగీరు P *jagir*
సర్కారువారు చేసినసేవకు బహుమానముగ గాని సేవజేయుటకు భృతికి బదులుగ గాని ఇచ్చు భూమి.

జాలె. నాణ్యములుంచు వలసంచి.

జాహీరు P. *zahir* తెలియవచ్చు.

జీరా P. *zira* కవచము. armour, mail
'అంగరఖాలు దొడిగిరి
పైన ఉక్కుజీరా తొడిగిరి'. -పుట 74

జోడాలు H. *joda*
వార్తావహులు, హర్కారాలు. జోడా అనగా జతయని యర్థము; కాని దీనికి సందేశహరులను నర్థమెట్లు కలిగెనో తెలియదు వీరు జతలు జతలుగ సమాచారములు గొని పోవుటవలన నీమాట కీయర్థము రూఢియై యుండవచ్చును.

డెబ్బెరెండు కరపట్టాలు.
కరపట్టమనఁగా ఓడరేవు లేక రేవు పట్టణ మని యర్థము అనవేమారెడ్డి మోటుపల్లి శాసనమునం దది కరపట్ట మని పేర్కొనబడినది. షోడశకుమార చరిత్ర (౬:౯౫.) యందు గూడ ఈమాటకలదు.
'పీడుకొని బహుపర్వతవిపినరాష్ట్ర
పంక్తిఁ దటెయించి యొక కరపట్టణమున
కరిగి యాద్వీపమునకు దానరుగువారి
నెమ్మి దడవంగ దైవయోగమ్మునందు'.
వీనిని వేళాపురములనియు జెప్పుటకలదు. కాని వీని సంఖ్య ద్వాత్రింశ (౩౨) దని శాసనములందు జెప్పబడియున్నది.

(Ep Car vii. sk. 118)

తతిమ్మా P. *tatimmah* తక్కిన, కొఱవ.

తనగాము. నీళ్లు నించికొనిపోవు పీపావంటిపాత్ర విశేషము.

తయారు P. *tayyar* సిద్ధము.

తాఖీదు P *takid* ఆజ్ఞాపత్రిక. 'అని రాజు తాఖీదు చేసెను', అనగా రాజు ఉత్తరవు చేసెను అని

తుపాకీ. P. *tufang*
మందుగుండువేసి గట్టించి కాల్చెడి యయోనాళాయుధ విశేషము.

తురుపు. troop. ఇంగ్లీషు మాట.
గుఱ్ఱపు దళము.
'అసానల్లీఖాకేమి
గుఱ్ఱమువీద ఎక్కెను
నాలుగు వందల తురుపుతో
వచ్చినదారిని తిరిగెను' పు౹. 75

తేజీ P. *tezi* అరబీదేశజమగు నశ్వము.
'హయముంజీ బలుతేజిహారులుదెచ్చె'
అని శ్రీనాథుఁడు. హరి.వి. ౧-౭-౬
ఇదియె ఈమాట కాంధ్రమున బ్రథమప్రయోగమని తోచెడిని. అర్వాచీన వాఙ్మయమున విశేష్యముగ బ్రయోగింపబడినను, పై ఉదాహరణమున 'తేజిహారులు' విశేషణముగ గానవచ్చుచున్నది. శబ్దరత్నాకరకారులు 'తేజి' దేశ్యమనిచెప్పిరి. కాని వాస్తవముగ నది పార్సీనుండి ఎరవు తెచ్చుకొన్నమాట.

తొరక (తొలక). తోలు, చర్మము.

దండపగడ.
ఇరువై నాలుగు మూరలది
దండపగడ తీసెను.
... ... ... ...
దగ్గరకు రానిచ్చి
పెదురుగడను ఎత్తెను
త్రిప్పి ఒగ్గి పెట్టుపెట్టెగద.
—పుట 34.

ఇందువలన దండపగడ యనునది యొకపెదురుగడయని తెలియుచున్నది. 'దండపగడ'

'పగడదండ' యు నొక్కటియగునా యన్నది విచారణీయాంశము.

'కవిరాజు కంఠంబు కౌఁగిలించెనుగదా పుర
వీథి నెదురెండ పొగడదండ'

అను సందర్భమున గూడ దీనికి నెదురు గప యని యర్థము చెప్పుకొనుట సరియా?

దండెము. గరిడీగాజేయు నొక సాదన విధము.

దకోలు. వశము, కానుకగా నిచ్చుట.

దగలా (దగళా) *daglah* A coat of mail ఉక్కుకవచము.

చీనాచుట్టు దగలేమి
తొడిగెను రామన్న. —పుట 14

దరవాజా P. *darwazah* ద్వారము.

దరోబస్తు *darobast* యావత్తు.

దస్తు P. *dast* వసూలైన పైకము.
దస్తు అనగా చేయి; చేతిలోనికి వచ్చిన పైకమున కది రూఢియైనది.

దానాపాణీ H. *danapani* గుఱ్ఱమునకుబెట్టు ఉలవలును నీళ్లును

దాయకట్టు. బందముచేయు, పశువుల కొండొంటికి లంకెలువేయు.

దివాన్ P. *diwan* మంత్రి.

దీనాపదిండు. ఒకవిధమైన తలగడ.

దుద్దుపెట్టు. వంచనసేయు.

దుసాలువ P. *dushalah* జోడు శాలువలు. దుశ్శాలువయని రూపాంతరము.

దుశ్శాలువ. చూ. దుసాలువ.

నగరికోమాళ్లు. నగరి బిడ్డలనియు జెప్పుటకలదు. నగరి యాఁడపాపలకు బుట్టి నగరియందే పెరిగినవారు. రాజులకును, రాజపుత్రులకును సేవచేయుటయే వీరి వృత్తి. రాయవాచకమున వీరు కుమాళ్ళనియు, హరిబాణంకుమాళ్ళనియు చేర్కొనబడి యున్నారు. 'హరిబా(వా)ణ'మనఁగా పళ్లెరము. రాజును రాజపుత్రులును భుజించిన పిమ్మట పళ్లెరములోని యుచ్ఛిష్టమును భుజించువారు గావున వీరి కాపేరు వచ్చినది.

నాలుగు స్తంభాలాట. బాలక్రీడా విశేషము.

నీళ్లుపోయు. తిలోదకము విడుచు, చంపు.

నౌకరి P. *nawkar* సేవకుఁడు.

పకీరు టెక్కెము. ఆకుపచ్చయందు నీలిమగలసిన వర్ణముగల జండా.

పచ్చబద్దలవారు. బద్దలవారు అనఁగా వేత్రధరులు. వేత్రముల వర్ణమునుబట్టి పచ్చబద్దలవారు అను పేరు వచ్చియుండవచ్చును.

పటాని పాగారౌతు. పాగా యనగా గుఱ్ఱపు లాయము. పటానివారి గుఱ్ఱపు లాయమునకు జెందిన రౌతు.

పరంజాకపోవు. పాతిపోవు.

'మఱి యివతల అవతల పరంజాక పో
వు బలముమీాద పడినఱకుచున్నాడు'.
-పుట. 72

పరగడ. బయట.

ఫలాన(ని) P. *falana* అట్టి, ఒకానొక.

పాంజేబు P *pazeb* స్త్రీలు కాలికి ధరించు వెండి గజ్జె గొలుసు.

పాచ్చావులు. పాదుశాహులు.

పారాచౌకీ P. *parahchawky* కావలివారు కాపుండు స్థలము.

పావడము (పాగడము, పాడగము). వంకరకడియము. అనగా స్త్రీలు పాదములందు వొంకెలుగా చేసియుంచే భూషణము. A silver anklet of a vandyked form' —Brown.

పాహదుషా P. *padshah* పాదుశాహు. ఢిల్లీని పాలించిన మహమ్మదీయ చక్రవర్తుల బిరుదు.

పిల్లాణులు (పిల్లాండ్లు). పెండ్లియైన స్త్రీలు కాలి నాలవ వ్రేలికిబెట్టుకొను వెండి యుంగరము.

పునాది P. *bunyad* మూలబంధము.

నరలోకమందున
పుట్టినవాడు అయితేను
ఇంతటి శౌర్యమున్నదా ?
పునాది తెలియదు'. పుట 68.

ఇచ్చట 'పునాది' యనగా పుట్టుక అని యర్థము చెప్పకొనవలసి యున్నది.

పురమాషి P. *faramash* చూ అరమషీ.

పొడుగున. దూరము.

'పోవు పొడుగున నఱికిరి' —పుట 75

ఫిరంగి (పిరంగి, పిరంగీ) P *firangi* శతఘ్ని.

ఫిర్యాదు P. *firyad* విన్నపము, మొఱ

ఫౌంజు (పవుజు, పౌజు) P *fauj* దండు, బారు.

బంట్రౌతుమానా (బంటు + రౌతు + మానా)

ఇందు బంటు రౌతులనునవి రెండును తెనుగు మాటలు. మానా హిందీ. (బంటు-పదాతి రౌతు-అశ్వికుడు, మానా-గుణము.) కాని ఇచట సిపాయిగిరి బంట్రౌతుమానాయని యున్నది; కావున బంట్రౌతుమానా యనగా రౌతుఁదనమని యర్థము జేసికొనవలసి నట్లున్నది.

బందోబస్తు P. *bandobast* భద్రము, జాగ్రత

బకపాయించు. ఇదిపార్సీ బఖ్షా లేక బఖ్షాన అను మాటలలో నొక్కదానికి తెనుగు రూపమై యుండును. ఇచ్చు, మన్నించు, క్షమించు అని యర్థము.

బగిలిమాటలు. బింకపుమాటలు.

బలముచెప్పుట. నాలుగు స్తంభముల ఆటలో 'నాలుగు స్తంభాలాట నడిమికి తొడిమికి తానక తప్పక తనపేరేమంటే' ఇత్యాదిచెప్పి దొంగను సూచించుట.

బవిరిరేకులు. స్త్రీలు కొనచెవిని ధరించు నాభరణములు.

బాజాభజంత్రీలు H. *baja bajantri* సంగీత మేళము. 'musical band'—Brown.

బాజారు P. *bajar* అంగడివీధి.

బజారని సామాన్యముగ వాడబడుచున్నది. ప్రాచీన తమప్రయోగము,

'బాజారేచూచికాంత పక్కుననవ్వెఁ' అని శ్రీనాథుఁడు.

బాజీ(జూ)బందు P *bajuband* సందిటి కడియము, రెట్ట కడియము.

బారుపెట్టు. తుపాకిలో మందుగుండువేసిగట్టించు.

బాలీసుదిండు P. *balish* ఒరగుదిండు.

బిడిగల్లుగ. అమాంతముగ, హటాత్తుగ.

బిసాతు. బిసాతు అని సామాన్య వ్యవహారభాష యందు చెల్లుబడిగా నున్నది. ఇదియే సరియైన రూపము. P. *bisat* శక్తి, బలము అని యర్థము.

బురుజు P *burj* పిరంగిపెట్టి కాల్చె దిబ్బ. గడి, చిన్నకోట. —Brown

బేడలు. కాయధాన్యముల పప్పు.

భజంత్రీలు H. *bajantri* చూ. బాజాభజంత్రీలు.

భువనేశ్వరము. చుట్టుబవంతి.

'A house, containing an open area which has rooms built at the corners and has roofs between.

నాలుగిండ్లు కలిసి కట్టినది' —Brown.

మచ్చు. మీద కట్టడములేని మిద్దెయిల్లు (శ.ర) అనఁగా కప్పులేని మిద్దెమీదియిల్లు.

'సోరణగండ్ల మచ్చుపై కెగసి'

కట్టా రామాయణము.సుం॥కాం. పుట 32.

ఇందువలన మచ్చునకు గవాక్షములుండునని తెల్లము. స్త్రీలతోఁగూడ రాత్రులు వెన్నెలలో విహరించుట కొఱకు నిర్మింపబడునది. సాధారణముగ మహమ్మదీయ గృహము లందుగానవచ్చును.

మట్టిలాగులు. జెట్టీలు సాదనజేయునపుడు తొడుగుకొను మోకాలివఱకు వచ్చు ఇజారు.

మహాలుదారు. P mahaldar చిన్నభూస్వామి మహాలంటగా గ్రామము పుగాని పట్టణముగాని పాలనసౌకర్యమునకై చేసిన భాగము మహాలుదారుడు మహాలున కధిపతి.

మాజూము. P. m'ajum బాగిలాకు బెల్లము మొదలయినవి వేసిచేసిన మిశ్రద్రవ్యము —Brown.

ముస్తాదు P. must'id సిద్ధముగానుండు.

మైసాదు. ఒకవిధమైన యడవి మృగము.

మోయమాటి(మోయమతి). మోయమతి సరియైన రూపము. ఇది పార్సీ mu'ayyan నుంచి యేర్పడినది; బత్తేమునకు వలసిన అని దీనికి అర్థము.

మొహారీ. P. muhr పదునైదు రూపాయల విలువగల బంగారు నాణ్యము.

రద్ది. అల్లరి, గొప్పధ్వని.

రసీదు. ఇంగ్లీషుమాట reciept, చెల్లుపత్రము.

రుమాల P. rumal తుండుగుడ్డ, చేతిగుడ్డ.

లండీ. కుత్సిత పురుషుడు, కుత్సిత స్త్రీ.

లష్కరు P. lashkar దళము.

వడికాడు. వడిగలవాడు.

వస్తాదు P. ustad గడిదేరిన సాధనకాడు. సాధనజోదు

విల్లెవిరాలు. గంతులు అని సందర్భమును బట్టి అర్థము దోచుచున్నది.

'కాళ్లును చేతులును భూమిమీద ఆనించి ఆ దండులోపలికి మూడు విల్లెవిరాలు వేసినాడు'. —పుట 70.

వెల్చుకొను. (వెలచుకొను) శుద్ధిచేసికొను, కడిగికొను.

శిఖామొహరు P. sikkah muhr ముద్ర.

'ఈ శిఖామొహరు తీసికొనివెళ్లి మాతమ్మునికి అగుపఱిచితిరా...' పుట 72

సదురు (చదురు) P. sadar సభ.

'సదురుమీద కూర్చునియున్న ప్రభువుకు మహా కోపమువచ్చి,' —పుట 74

సముజాయించు. సముదాయించు, ఓదార్చు ముజాయించు కన్నను 'సముజాయిను' కాంద్రీకరణము.

సరంజాము P saranjum సామాను, వస్తువులు.

సరంబీ (మలయాళమాట) కూర్చునుట కుపయోగించు ఎత్తైన నాలుగుకాళ్ల పెద్దబల్ల. బలంపీటయనియు చెప్పుటకలదు.

సర్కారు P. sarkar దివాణము, ప్రభుత్వనిర్వాహకులు.

సర్వసుంబాల. నిశ్శేషము

సర్వ - సంస్కృతము.

దుంబాల dumbala పార్సీ.

సాంబ్రాణిసాదులు. (సాంబ్రాణి యనగా నుత్తమాశ్వము, సాదు లనగా రౌతులు) ఉత్తమాశ్వములపై స్వారిచేయు రౌతులు. సాంబ్రాణి. అర్వాచీనాంధ్ర వాఙ్మయమును బ్రవేశించిన యన్యదేశ్యపదము. కిట్టెలునిఘంటువులో నీమాటకు N of a country, a horse of that country' అని యర్థము వ్రాయబడియున్నది. ఇందువలన సాంబ్రాణి యను దేశమొక్కటి కలదని యూహసేయవలసి యున్నది. Tamil Lexicon లో 'చాంపిరాణి' சாம்பிராணி యను మాటకు Malay - Samrani. A district in Malacca famous for its horses అని వివరణగలదు. దీని కాధారముగ తిరువాలవా 27,78 'కాంబోజ మారియ ఇాంపిరాణి ... మున్నాన్ తురంగం' అను వాక్య ముదాహరింపబడి యున్నది. ఇందువల్ల మలకా ద్వీపములోని సామ్రాన్ మండల ముత్తమాశ్వములకు ప్రసిద్ధినొందినదనియు, నచ్చటినుండి దిగుమతియగు గుఱ్ఱములు సాంబ్రాణు లనబడుచు వచ్చెననియు తెలియవచ్చుచున్నది.

సాఫు P. *suf* ఏమియు మిగులకుండ.

సామాను P. *saman* వస్తువులు, పదార్థములు.

సాలుగుదస్తాలెఖలు. సరియైన రూపము సాల్ గుజాస్తా *salguzashta* అనగా గడచిన సంవత్సరపు లెక్కలు

సాలుఝాడా H. *salzhada* పూర్తి సంవత్సరము, సంవత్సరము పూర్తిగా, సంవత్సరమున కంతకు.

'సాలుఝాడాగా పైకము బట్టుకొని వచ్చిన సీమానము దక్కుచున్నది'. —పుట 78

సిపాయిగిరి P. *sipahgiri* ఆయుధోపజీవనము, సిపాయితనము.

సిబ్బంది P. *sibandi* కట్టుబడివాండ్లు, బంట్రౌతులు.

సిలెబక్తరు. సిలాబగ్తర్ P. *silahbagtar* సరియైనరూపము. ఉక్కుకవచము.

సిస్తు P. *shist* పన్ను.

సూడిద. కానుక.

సూర్యవంక. స్త్రీలు తలయందు ధరించు సూర్యబింబమువంటి బంగారు ఆభరణము.

సూర్యసోమ వీథులు. ఇది నిఘంటువుల కెక్కని మాట. పురములందు ఒకదాని కడ్డముగి మఱియొకటి దాటు రెండు పెద్దవీథులు. బొబ్బిలివీరులు శత్రుసైన్యము ను సూర్యసోమ వీథులుబాఱ నఱికినట్లు బొబ్బిలి కథయందు జదివినట్లు స్మరణ.

సోమవీథిని గూర్చి ప్రయోగ మొక్కటి.

'మల్లెల్ మొల్లలు సేమమా? శుభములా మా కందముల్ జాజులున్
మొల్లంబారక యుండునా? సుదతులున్ మోదంబు వాటింతురా ?
విల్లుంగోలయు (యేమరూఢ మగునా?) వేమాలనూ యున్నదా ?
నెల్లూరన్ బదసోమవీథసికదా నీరాకలైవార్తకా?.
—చాటుపద్య మణిమంజరి. పుట 30.

షెమ్మె P. *shim'a* దీపస్తంభము.

స్వారి P. *sawar* సవారి, వాహ్యాళి.

హాజరు P. *hasir* వచ్చియున్న.